జ్యోతీన్

(మణి వేపు చూసి) నువ్వు ఎవరవు?

పిన్ని

వినలేదూ? అది నీ మణి!

జ్యోతీన్

తలుపు పూర్తిగా విడిపోయిందీ— అంతా?

పిన్ని

అంతా విడిపోయింది.

జ్యోతీన్

పిన్నీ, పాదాలమీద శాలువ తీసేయి, ఆ శాలువ తీసేయి, అవుంటపెట్టేయి—దూరంగా తోసేయి.

పిన్ని

శాలువ కాదమ్మా జ్యోతీన్. మణి నీ పాదాల మీద పడ్డది, తలమీద చెయ్యివేసి ఒక్కమారు ఆశీర్వాదం చెయ్యమ్మా!

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1927.

విశ్వభారతి గ్రంథమాల—1.

# గృహప్రవేశం

రవీంద్రనాథ్ ఠాకూర్



శోభనాదేవి

వైకుంఠరావు

గార్లచే అనువాదము

విశ్వభారతి ఏజన్సీ

2 ఫిరన్వీథి

చెన్నపురి:

1927

ప్రకాశకుడు:

కా. వైకుంఠరావు,

2 ఫిలిప్‌వీథి

జార్జిటౌన్, మద్రాస్.

# గృహప్రవేశం

---

జనవరి 1927

---

వెల 12 అణాలు

---

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

292, ఎస్‌ప్లనేడ్, చెన్నపురి

వారివద్దకూడా పుస్తకాలు దొరుకును.

# గృహప్రవేశం

## మొదటి అంకం



జోతీన్ గది పక్కగది

పొరుగు ఆవిడ; జోతీన్ చెల్లి, హిమి

పొరుగు ఆవిడ

జోతీన్ ఒంట్లో ఈవాళ ఎలాగుంది, హిమీ?

హిమి

బాగులేదు, పిన్నీ

పొరుగావిడ

ఆకలేమైనా వేస్తూ ఉంటుందా, అమ్మా?

హిమి

ఏమీలేదు, ఒక చెమిచాడు బార్లీ ఐనా ఇమడదు.

పొరుగావిడ

నేను చెప్పేది కొంచం విందూ, తల్లీ. మా ఆడబిడ్డ పెనిమిటికి సమంగా ఇలాంటి జబ్బే చేసింది. దేవుని ధర్మానా హారం మట్టుకు వెళ్లేది, ఆకలుండడం ఒక్కటే రక్షించింది. కొంచం ఇటూ అటూ ఒత్తిగిల్ల గలిగేవాడు—జొాతీన్‌కు ఉన్నట్టే—ఈపక్క ఎముకలన్నీ నొప్పి—

హిమి

అన్నయ్యకు నొప్పేమీ లేదే !

పొరుగావిడ

నొప్పి లేకపోవచ్చును, గాని మా ఆడబిడ్డ మొగుడూ సమంగా ఇలాగే నెలలతరబడి మంచం పట్టాడు. అందుకనే నేను చెప్పే మాట కొంచం విని ఫరిద్‌పూర్ నుంచి ఆ కపిలేశ్వరస్వామి ప్రసాదం—మీరు తెప్పించినా సరే లేదాఅంటే నాకొడుకు అతుల్‌ను పంపించి—

హిమి

మా పిన్నికి ఒకమాటు చెప్పి చూడు. పిన్ని గాని—

పొరుగావిడ

మీపిన్ని చెవిని పడనివ్వదు. ఇదంతా ఒకలక్ష్యమా ఆవిడికి, ఇలాంటివన్నీ లక్ష్యపెట్టే మోస్తరైతే ఆవిడికి

అలాంటి దశ ఎందుకు పడుతుంది——గాని ఇదేమిటి హేమీ, మీ వదిన జ్యోతీన్ గదివేపైనా వెళ్ళదు.

**హేమి**

వెళుతూ ఉంటుందే తరుచుగా; ఏదో——

పొరుగావిడ

నాదగ్గిర దాస్తే ఏమి ప్రయోజనం తల్లీ? నానా ప్రయత్నాలు చేసి ఎంతో చక్కని పిల్ల అని తీసుకు వచ్చి పెళ్లి చేశారు. ఎక్కడాలేని ఈఅందం అంతా ఇప్పుడు కష్టకాలంలో ఎందుకేమిటి? అంతకంటే ఏదో ఒక నల్లని పిల్ల, కురూపిని——

**హేమి**

ఆలాగనకు పిన్నీ, మావదిన చిన్నపిల్ల——

పొరుగావిడ

ఓయి బాబు, ఎవరు ఆచిన్నపిల్ల! ఈడు మభ్యపరిచి పెళ్ళైతే చేశారు గాని మాకు కళ్లు లేవనుకున్నారు కాబోలు. పాపం ఎలాంటబ్బాయి జ్యోతీన్, అతని నొసట ఇలాంటి——ఇదిగో వస్తూఉంది మణి. (మణి ప్రవేశం) దా అమ్మ, దా, డాబామీదనా ఉన్నావు ఇంతసేపూ?

మణి

ఆ

పొరుగావిడ

సీలుగారి ఇంటిదగ్గిరనుంచి పెళ్లివాళ్లు బయలు దేరు తున్నారు; అది చూడడానికి గాబోలు డాబామీదికి వెళ్లావు. ఇంత చిన్నపిల్ల, పాపం, రాత్రిం బగళ్లు జబ్బు మనిషిని కనిపెట్టుకు—

మణి

నాపూలమొక్కకు నీళ్లు పోదా మని వెళ్లాను.

పొరుగావిడ

మహాబాగా జ్ఞాపకం చేశావు. మీ గులాబిఅంట్లు, మంచివి, నాకు రెండివ్వాలి. మా అతుల్‌కు ఆ మొక్క లంటే నీలాగే అతిసరదా.

మణి

ఓ, తప్పకుండా ఇస్తాను.

పొరుగావిడ

మరీ—చూడమ్మా ఇవాళా రేపూ మీ గ్రామొఫోన్ మాట తలపెట్టకుమా—గాని, నువ్వు చేయించినా సరే,

లేదాఅంటే నేను ఖర్చుపెట్టైనా మరమ్మత్తు చేయించి—

మణి

తీసుకువెళ్లండి, తీసుకువెళ్లండి, అందులో ఏముంది.

పొరుగావిడ

మీ ఆడబిడ్డ చెయ్యి అతిభారీ. కాక మరే మౌతుంది! ఇంత గొప్పింటిపిల్ల, బంగారుతల్లి!—ఇదుగో వస్తూ ఉంది మీపిన్ని, నేనిక పోతా. జోతీన్ ద్వారందగ్గిర కాపుండి ఎవ్వరినీలోపలకు వెళ్లనివ్వదు. జ్వరాన్ని మాత్రం ఆపలేదు గాని, పాపం, మన్నందరినీ అడ్డు పెట్టేస్తుంది. (పొరుగావిడ వెళిపోతుంది)

హిమి

ఏమిటి వెతుకు తున్నావు వదినా?

మణి

నాకుక్కపిల్లకు పాలు పెట్టే సాసరు.

(పక్కగదిలో పిన్ని ప్రవేశం)

పిన్ని

అమ్మాయి, నీఅడుగుల చప్పుడు కోసం ఎప్పుడూ చెవులు ఇలాగు పెట్టుకు కూర్చున్నాడు జోతీన్—అది

నీకు తెలుసునా? ఇటువంటి సంధ్య వేళప్పుడు జబ్బు మనిషి గదిలోకి వెళ్లి దీపం కొంచం వెలిగించి రా అమ్మా, వాడి మనస్సుకు కొంచం ఆనందం కలగనీ—ఏమి టయింది ఆలాగు చేసుకుంటున్నావు—అడిగిన మాటకు జబాబు చెప్పవేమి?

మణి

ఇప్పుడు—మా—

పిన్ని

వస్తే రానీ, నిన్నట్టేసేపు అక్కడ ఉండమని చెప్ప లేదే? ఇప్పుడు వాడు మకరధ్వజం పుచ్చుకొనే వేళ యింది; నువ్వు వస్తావనే ఉంచాను. ఆకల్వం పుచ్చుకొని వాడి కాళ్లవేపు నిల్చొని చప్పుడు లేకుండా మెల్లి మెల్లిగా నూరి కొంచం తేనెతో కలిపి వాడి కియ్యి. వాడు అది నాకివేయగానే చక్కారా అమ్మా.

మణి

మధ్యాహ్న మప్పుడు వెళ్లాను కానూ మరి ?

పిన్ని

అప్పుడు వాడు పడుకున్నాడు గదమ్మా.

మణి

సాయంత్ర మప్పుడు ఆగదిలోకి వెళ్లడంఅంటే నాకు ఎలాంటి భయమో మరి—

పిన్ని

ఎందుకూ భయం?



మణి

ఆయింట్లో మామగారు చచ్చిపోయినారు, అదెప్పుడూ నాకు జ్ఞాపకం వస్తూ ఉంటుంది.

పిన్ని

ఎవరూ ఎప్పుడూ చావకుండా ఉన్న జాగా ఈ ప్రపంచంలో ఎక్కడైనా ఉంటుందా ఏమిటి?

మణి

అలాగనకు అత్తా, అలాగనకు. నిజంచెప్తున్నాను, నాకు చావంటే అతి భయం, అత్తా.

పిన్ని

పోని ఐతే, అమ్మా, సాయంత్రంవేళప్పుడు కాకపోతే మరి కొంచం—

మణి

ప్రయత్నం చేశాను వెళదామని, గాని ఒళ్లో ఎలాగు గజగజమని—ఆయన మొఖం ఇలా—గు చేసి నావేపు చూసే సరికి, రెండు కళ్లూ జిగ్ జిగ్ మంటూ—

పిన్ని

భయానికేముంది అందులో

మణి

చూచేసరికి నాకు ఆయనెంతో దూరం నుంచి చూస్తు న్నారు అనిపిస్తుంది. ఇంకేదో లోకంలోనుంచి చూస్తు న్నట్టుగా—

పిన్ని

పోనీ అమ్మా, పైనుంచే పథ్యం పానం చేసి కొంచం ఇస్తూ ఉండు చాలును. నీచేతిలో, నువ్వే వాడి కోసమని చేసిచ్చావని వింటే వాడి మనస్సు ఎంతో—

మణి

అత్తయ్యా, మీరు నన్ను విడిచి పెట్టేయండి ఇక, రాత్రింబగళ్లు జబ్బు మనిషికని ఇదీ అదీ చేస్తూ ఎల్లకాలం కనిపెట్టుకొని ఉండడం నావల్ల కాదు.

పిన్ని

ఒక్కమాట అడుగుతాను: నువ్వెప్పుడూ పెద్ద జబ్బేదీ పడలేదూ! పడేఉంటే___

మణి

పెద్ద జబ్బు పడ్డట్టు నాకేమీ జ్ఞాపకం లేదు గాని, కోన్నగర్‌లో మాతోట ఇంట్లో ఉన్నప్పుడు ఒకమారు జ్వరం వచ్చింది అమ్మ ఎక్కడికీ కదలకుండా నన్ను గదిలో కట్టి పెట్టి ఉంచింది. ఎవ్వరికీ కనబడకుండా దొంగతనంగా పారిపోయి ఒక మురికిచెరువు ఉంటే అందులో స్నానం చేసి వచ్చాను. అందరూ నాకు న్యూమోనియా వస్తుందని అనుకున్నారు. గాని ఏమీ కాలేదు. ఆవాళేజ్వరం పోయింది.

పిన్ని

మీ ఇంట్లో ఎప్పుడూ ఎవరికీ ఏజబ్బూ చేయలేదూ?

మణి

నే నెప్పుడూ చూడలేదు. ఈ ఇంటికి వచ్చి మొదటి చావు చూశాను నా కెలాగుంది గదా___ఎలాగైనా వదలించుకొని పారి పోదామని! ఈ తైలాల వాసన

చూ స్తే ఆసుపత్రి భూతం ఏదో వచ్చి గాలికి పట్టిందా అనిపిస్తూఉంది.

పిన్ని

నీ స్వభావం ఈలాంటిది గదా నీతో సంసారం—

మణి

అదంతా నాకు తెలియదు. మీాతోటలో మాలీపని ఇవ్వండి, నాకు—అది ఎంత చక్కగా చేస్తానో చూదురు గాని (తొందరగా వెళిపోతుంది)

హీామి

చూడు పిన్నీ, వదిన స్వభావం ఎటువంటిదో, తెచ్చు కుందా మన్నా కోపం రాదు. నాకుఅనిపిస్తుందీ: దేవుడు తనది పూచీ కాదనుకొని ఈలోకంలో ఆమెను పుట్టిం చాడు అని. దుఃఖం అనగా కష్టం అనగా ఆవిడతలకు ఎక్కనే ఎక్కదు.

పిన్ని

పైరూపురేఖలు నిర్మించడంలోనే భగవంతుడు కూర్చున్నాడు,లోపలివస్తువులు సరిచేయడం పూర్తికాకుం డానే వేళఅయిపోయింది మీాఅన్నయ్య కడుతూఉన్న ఇంటి మో స్తరే మరేమిటి! విశ్వప్రయత్నంచేసి కట్టడం

ప్రారంభించాండు——పైహాలు ఇంకా అవుతూ ఉండగానే దివాలా——, లోప్రహాలులో పరంజాలు ఇంకా విప్పనైనా విప్పలేదు.——ఇవాళ వాడిని ఏలాగైనా కొంచం మరిపించాలి, ఇంటిమాటా మణిమాటా జ్ఞాపకం రాకుండా.

హిమి.

అదేమో నాకు తెలియకుండాఉంది సుమీ పిన్నీ, ఇదంతా మన మంచికేనా?

పిన్ని

నీకేమి తెలుస్తుందమ్మా హిమీ! చావు నెత్తిదగ్గిరికి వచ్చి కూర్చుని ఉంటే ఇల్లు తయారైతేనేమి కాకపోతేనేమి——ఇందులోవచ్చేదేమిటి పోయేదేమిటి! అందుచేతనే నేను అలాగు చెప్తున్నాను——"నువ్వు మనస్ఫూర్తిగా సంకల్పంచేసుకున్న ఇల్లు పూర్తి అయింది" అని నిజం అంటే మరేమిటి హిమీ, అదే.

హిమి

సరే, ఇంటిమాట అలాగు అయింది అనుకో, మరి వదినమాటో?

పిన్ని

హిమీ, సృష్టిఅంతటిలోనూ లోటులేనివస్తువు ఒకటి

ఉన్నది అంటే అది మీా వదిన—దేవుడు అంత రూపు ఇచ్చాడు ఆమెకు. అనాదిగా ఉన్నమణి, భగవంతునిమన స్సులో ఉండేఆధనం, ఆమణి, ఆకౌంస్తుభరత్నం—ఆమణే మన మణి. అందులో వెతుకుదామంటే ఎక్కడా వంక కన బడదు. మృత్యుసమయంలో జోతీ ఆ విధాత మన స్సులో ఉండే మణిని చూస్తూ కొంచం సంతోషించనీ.

హిమి

నీమాటలు వింటే నా మనస్సంతా ఏదో ఒక అపూర్వ మైన కాంతితో నిండిపోతూ ఉన్నట్టుంది, పిన్నీ.

పిన్ని

హిమీా, మాటలు మాత్రం ఆడుతున్నాను గాని మణి అంటే కోపం నేను మానలేదు. అంతా తెలిసినా కోపం మాత్రం విడిచిపెట్ట లేకుండా ఉన్నాను—గాని హిమీా, నువ్వు అన్నావు, జ్ఞాపకం ఉందా, వదినమీాద తెచ్చుకుం దామన్నా కోపం రాదు అని—అందులోనే తెలుస్తుంది, నువ్వు జోతీన్ చెల్లెలవే అని—ఇక జోతీన్ దగ్గిరికివెళ్లాలి (పిన్ని వెళుతుంది.)

(ఋఖ్బగది)

జొతీన్

పిన్నీ, మూడో అంతస్తుగదిలో ఇటికలు పేర్చు అంతా అయిపోయింది గదూ?

పిన్ని

ఆ, నిన్నను అయిపోయింది.అంతా.

జొతీన్

అన్నహా! ఎన్నాళ్ళకు పూర్తయింది! ఎన్నాళ్లనుంచి కడుతూఉన్న ఇల్లు, ఎన్నాళ్లనాటి స్వప్నం!

పిన్ని

ఎంతమంది రోజూ వస్తున్నారు, జొతీన్, నువ్వు కట్టిస్తూఉన్న ఈ ఉల్లుచూడడానికి!

జొతీన్

వాళ్లంతా పైనుంచే చూస్తున్నారు. నేను లోపలి నుంచి చూడ గలిగిన దంతా ఇంకా పూర్తికాలేదు—ఎప్పటికీ పూర్తికానే కాదు. కల్పనప్రపంచంలో ఇంతవరకు ఏశిల్పైనా చెప్పగలిగాడా ఏమిటి: ఇదిగో దీనితో ఆఖరురాయి పేర్చడం అయిపోయింది, అనుకున్న దంతా

పూర్తిఅయింది, అని? ఈవిశ్వమంతా పుట్టించిన సృష్టికర్తే చెప్పలేదు—అతని పని అసలు పూర్తిఅయింది గనుకనా!

పిన్ని

సరేగాని ఇక మరి వద్దమ్మా, కొంచం సేపు నిద్రపో.

జ్యోతీన్

అబ్బా వద్దు సుమా, పిన్నీ; ఇంత త్వరగా పడుకోమని చెప్పకుమా ఈవాళ.

పిన్ని

గాని డాక్టరు—

జ్యోతీన్

ఉండనీ డాక్టర్ మాట; ఈ వాళ నా ప్రపంచం తయారై పోయింది. నే నీవాళనిద్రపోను—ఇవాళ ఇంట్లో దీపాలన్నీ వెలిగించేయి పిన్నీ—మణి ఎక్కడ, ఒక్కమారు మణిని—

పిన్ని

పువ్వులూ-అన్నీ పెట్టి ముస్తాబు చేసి మణిని మూడో అంతస్తులో కొత్త గదిలో కూర్చోబెట్టాను.

జ్యోతిన్

భేష్ భేష్, నీకా బుద్ధి ఏలాగు పుట్టింది పిన్నీ;ఎంత సంతోషంగా ఉందనుకున్నావు నాకు!—రెండు పక్కలా మంగళఘటాలు పెట్టావా?

పిన్ని

ఆహా.

జ్యోతిన్

కింద ముగ్గుతో పద్మం?

పిన్ని

బాగుంది, అదికూడా చెప్పాలి!

జ్యోతిన్

ఏలాగైనా నన్ను కుర్చీలోకూర్చోబెట్టి అక్కడికి తీసుకు వెళ్లలేరూ, పిన్నీ; ఒక్క మారు చూస్తాను, స్వయంగా తానుకట్టించిన ఇంట్లో మణి, నామణి,కూర్చొని ఉంటూఉండగా—

పిన్ని

అదేమీ కూడదు జ్యోతిన్, ఎంత మాత్రం కూడదమ్మా. డాక్టర్ కోప్పడతాడు.

జ్యోతీన్

పోనీలే ఐతే, మనస్సులోనే అలాగు చూసుకుంటాను—ఏచీర కట్టుకున్నదన్నావు, పిన్నీ?

పిన్ని

ఆ గులాబి రంగుది, పెళ్లిలో పెట్టిన చీరా.

జ్యోతీన్

మన ఇంటికి పేరు ఏమి పెడతామో తెలుసునా, పిన్నీ, నీకు?

పిన్ని

ఏమిటది, చెప్పవూ?

జ్యోతీన్

మణి సౌధం.

పిన్ని

మంచి చక్కని పేరు.

జ్యోతీన్

దాని అర్థమంతా నీకు తెలియలేదుసుమా పిన్నీ.

పిన్ని

ఔను, పూర్తిగా తెలిసిఉండదు.

జ్యోతీన్

సౌధం అంటే కేవలం ఇల్లే అని అర్థం చేసుకోకూడదు, అందులో సుధ ఉన్నది.

పిన్ని

ఔను ఉన్నది—కేవలం రూపాయిలతోనే కట్టినది కాదు—నీమనస్సులోనున్న సుధతో నింపి కట్టినది.

జ్యోతీన్

వింటే బహుశా మీరు నవ్వుతారు—

పిన్ని

నవ్వెందుకు జ్యోతీన్?—ఏదీ చెప్పు, ఏమిటి చెపాలనుకున్నావో.

జ్యోతీన్

ఈవాళ నాకు బోధపడ్డది! షాజహాన్‌కు ఆ తాజ్‌మహల్ కట్టించినప్పుడు ఎటువంటి ఆనందం కలిగిందో. ఆ ఆనందం అతనితో చావకుండా, దాటివచ్చి ఈరోజువరకూ—

పిన్ని

అదిసరే గాని, ఇక కొంచం మాటలు చాలించాలి,

జ్యోతీన్. నీకు నిద్ర రానూరాదు, నీకు నిద్రపోవాలనీ లేదు. నీమట్టుకునువ్వు మనస్సులోనే అనుకుంటూఉండు, అంతేగాని పైకేమీ అనవద్దమ్మా.

జ్యోతీన్

మణి పెళ్లినాటి బనారస్ చీరా, ఆగులాబి రంగుదా కట్టుకుందన్నావు? ఇవాళ ఒక్కమారు—

పిన్ని

తెలుసునా డాక్టరేమన్నాడో?

జ్యోతీన్

డాక్టర్ అనుకుంటున్నాడు, నాకేమో—

పిన్ని

నీమాట కాదు, మణిమాట. పైచేష్టలు చూసి మణిని పోల్చుకోలేము. లోలో పున ఎంత—

జ్యోతీన్

అతి పిరికి కాబోలు—డాక్టర్‌గాని చెప్పడా ఏమిటి!

పిన్ని

ఒకరు చెప్పాలీ, మేము రోజూ చూస్తూఉండడం లే?

జ్యోతీన్

ఆహా పాపం! అలాగైతే చాలా జాగ్రత్తగా ఉండండి పిన్నీ... ఔను ఇక్కడికివచ్చి ఏమిచెయ్యాలి? జబ్బు గది దగ్గిరికి రాకుండా ఉండడమే మంచిది.

పిన్ని

ఈగదిలోకి తనను ఎలాగైనా రానిస్తే చాలునని చూస్తూఉంది; గాని మేమంతా.—

జ్యోతీన్

అబ్బెబ్బె కూడదు, ఎంత మాత్రం కూడదు...

పిన్నీ, ఆపుస్తకాల బీరువాలో ఆల్బమ్ ఉంది, చూసి ఇవ్వగలవ్రూ? (ఆల్బమ్ తెచ్చి ఇస్తుంది) నీతో తాజ్ మహల్ మాట చెప్పాను కదూ? నాకిప్పుడు ఎలా గనిపిస్తుంది తెలుసునా, నాకుకూడా ఆషాజహాన్ మోస్తరే అయింది అని.జీవనం క్షీణించేదిక్కున నేనున్నాను,అభివృద్ధిపొందే దిక్కున అతనున్నాడు— మాఇద్దరికీ ఎంతో దూరం— అతని ఐశ్వర్యం మరి ఇంతా అంతా కాదు కదా. గాని చక్రవర్తికీ మమ్ తాజ్ ఉన్నది నాకూ ఉన్నది.నామమ్ తాజ్. ఆమెకే నివేదన చేసేశాను నాఇల్లు, నా తాజ్ మహల్. అందులో నే ఇప్పుడు ఉంది ఆమె; శాశ్వతకా

లమూ ఉంటుంది. ఇదే కాదు మా ఇద్దరికీ ఉండే సామ్యం —నాకూ కనబడదు నా మమ్‌తాజ్.

పిన్ని

ఎందుకు జ్యోతీన్ ఇంకా అలాగు మాట్లాడు తున్నావు, కొంచం ఊరుకో అమ్మా, నిద్రమందు తెచ్చిస్తానుండు.

జ్యోతీన్

వద్దు పిన్నీ, ఇవాళ నిద్రవద్దు మేలుకొనిఉంటే ఎన్నో మాటలు జ్ఞాపకం వస్తూ ఉంటాయి; నిద్రపోతే అవన్నీ పోతాయి... పిన్నీ నీదగ్గిర ఎప్పుడూ మణి మాటే అంటున్నాను, నువ్వేమీ అనుకోవుగదా?

పిన్ని

ఏమీ లేదమ్మా జ్యోతీన్. నాకెంతో సంతోషంగా ఉంటుంది—మాటలతో చెప్పలేను. ఎవరిమాట నాకు జ్ఞాపకం వస్తూ ఉందో చెప్పగలవూ?

జ్యోతీన్

ఎవరిమాట?

పిన్ని

మీఅమ్మ మాట. ఇలాగే ఒకరోజు తన మనస్సులో మాటలన్నీ నాతో చెప్పింది. మీనాన్న అప్పుడు మాఇం

ట్లోనే ఉండి మెడికల్ కాలేజీలో చదువుతూ ఉండే వా
డు. మీ అమ్మ మనస్సులో మాటలు అప్పుడు నాకుత
ప్ప ఇంట్లో మరెవరికీ తెలియవు. మా నాన్న అక్కనిచ్చి
పెళ్లి చేదామని ఇంకెవరినో వెతికి తీసుకు వచ్చాడు అ
ప్పుడు నే నతన్ని—

జ్యోతీన్

అది నువ్వు చెప్తేనే విన్నాను ఒకమాటు. తాతయ్య
అమ్మను ఏవిషయంలో కూడా బలవంతం చెయ్యలేకపో
యినాడు. చిట్టచివరకు నాన్నకిచ్చి పెళ్లిచేశాడు అప్పటి
మాట అనుకుంటే ఎంత సంతోషంగా ఉంటుంది పిన్నీ!

పిన్ని

మీ అమ్మ ప్రేమ ఒక గొప్పపూజ వంటిది. ఐదు సం
వత్సరాలు ఆమె హోమం తాలూకు నిప్పు ఆరకుండా
అలాగె ఉంది. అప్పటికి ఆవరుడు దొరికాడు. జ్యోతీన్, నీ
లో నాకు ఆకాంతే కనబడుతూఉంది. అందుచేతనే మధ్య
మధ్య నిశ్చేష్టురాలనై అలాగు చూస్తూ ఉంటాను.

జ్యోతీన్

అమ్మ తన్న కాంతితో నన్ను పూర్తిగా నింపి మరీ పో
యింది. ఆ తపస్సు వల్లనే నాకూ వరం దొరుకుతుంది. ఏ

మోగాని ఆవరం దొరికే సమయం అతి దగ్గిరికి వచ్చి
నటుగా నామనస్సుకు తటుతూ ఉంది—ఎక్కడ, ఆపి
ల్లంగోరు పాట ?

పిన్ని

పెళ్లి సనాయి. ఇవాళ పెళ్లిలగ్నం ఉంది.

జాతీన్

ఏమిటీవింత! ఇవాళే మణి గులాబిరంగు బనారస్
చీర కట్టుకుంది— జీవితంలో పెళ్లిలగ్నం మాటి మా
టికీ వస్తూఉంటుంది. ఇవాళ దీపాలన్నీ వెలిగించేయమని
చెప్పు పిన్నీ—వీధిగడప దగ్గిరనుంచి—

పిన్ని

వెలుతురు విస్తారంగా కళ్లల్లో పడుతూఉంటే నిద్రపో
లేవమ్మా. కొంచం—

జాతీన్

మరేమీ నష్టంలేదు. నిద్రవల్ల వచ్చే దానికంటే విస్తా
రం శాంతి వస్తుంది మేలుకుంటేను. చూశావా పిన్నీ, ఆ
లయం పూర్తిఅయింది—దేవవిగ్రహానికి ప్రాణప్రతిష్ఠ
అవుతుంది ఇప్పుడు. నేను బ్రతికి ఉంటూఉండగా ఇది
మాత్రం అవుతుందని నేనెప్పుడూ అనుకోలేదు.

పిన్ని

నేనీగదిలో ఉంటే నీమాటలు మరితగ్గవు. ఇదిగో మరి నేను వెళిపోతున్నాను. నిద్రపోవాలని లేకపోతే మాట్లాడకుండా ఊరకోనైనా ఊరుకో.

జ్యోతీన్

పోనీ, ఇంటి ప్లాను రాయించాను—అదినాచేతికిచ్చేసి వెళిపో. తరవాతా-ఇల్లు—ఆట పెట్టీ, అదీ—అనే సరికి ఆపాట జ్ఞాపకం వస్తూఉంది—హిమీ, హిమీ!

పిన్ని

గాభరాపడకు జ్యోతీన్, నేను పిలుస్తాను ఉండు.

(పిన్ని వె.)

(హిమి ప్ర.)

హిమి

ఏమి అన్నయ్యా?

జ్యోతీన్

ఆపాట పాడవు చెల్లీ—అదీ "ఆ ఖేలాఘర్" పాట?

(హిమి పాడుతుంది)

(డాక్టర్ ప్రవే.)

డాక్టర్

భేష్ భేష్, పాటలా! చాలా మంచిది. ఔషధంకంటే కూడా సంగీతం మంచిది. జ్యోతీన్, నువ్వు మనస్సును గాని ఎప్పుడూ ఆనందంగా ఉంచుకుంటే అతిశీఘ్రంగా బాగై పోతావు. తొంభైయైదేళ్లకంటే తక్కువ బ్రతకడం గొప్ప అపరాధం—అందుకు ఉరిశిక్ష విధించినా తప్పులేదు.

జ్యోతీన్

నాకివాళ అతి ఆనందంగా ఉంది. విన్నారా డాక్టర్ గారూ, ఇన్నాళ్లకు నా ఇల్లు పూర్తి అయింది. అదంతా నాప్లానే సుమండీ.

డాక్టర్

కావలసినది అదే. తను కట్టుకున్న ఇంట్లో తాను ఉండడమే అతి సంతోషమైన సంగతి. అద్దె ఇల్లైనా లేక పిత్రార్జితమైనదైనా స్వంత యిల్లు కాదు—మీనాన్నా నేను కలిసి ఒక్క క్లాసులో చదువుకుంటూ ఉండేవాళ్ల ము. ప్రాణం ఒక్కటి తప్ప తక్కిన వస్తువులు—ఈపనికి మాలినవి—ఏమీ కూడా ఆతనికి పూర్వుల దగ్గిరనుంచి రాలేదు. చూస్తూ చూస్తూ ఉండగా అంతా తానే సం

పాదించుకున్నాడు.దానివల్ల వచ్చే ఆనందం ఏమి సామాన్యమా ఏమిటి! మామగారు పెళ్లికి ఇష్టపడలేదు కదా అని కోపంచేత అతనిడబ్బు ఒక్క దమ్మిడీ ఐనా పుచ్చుకోలేదు. నువ్వు కూడా ఇల్లు స్వంతంగా కట్టించు కున్నావు—ఎంత సంతోషమైన మాట!

జ్యోతీన్

నాకు అతిసంతోషంగా ఉంది.

డాక్టర్

భేష్ భేష్, ఇక గృహప్రవేశం కావాలి. మాఅందరికీ విందు పెట్టించు—ఎప్పటికీ ఈలాగు పడుకొని ఉంటే పని జరగదు.

జ్యోతీన్

తప్పకుండా గృహప్రవేశం అవుతుంది అని ఇ-వ్వాళ్ళ నాకు అనిపిస్తూ ఉంది. ఒక్కమారు పంచాంగం తీసి చూస్తాను—మొట్టమొదటి మంచిరోజు ఏదైతే అదే...

డాక్టర్

సరే బాగానే ఉంది,గాని పంచాంగం అక్కరలేదమ్మా, అంతా మనస్సునిపట్టే గదా ఉంటుంది—మనస్సుకు నచ్చేదే శుభదినం.

జ్యోతీన్

నామనస్సు చెప్తూఉంది "శుభదినం వచ్చింది" అని. అందుకనే హిమిని పిల్చి పాట వింటున్నాను. గృహప్రవేశపు సనాయి ఈశరత్కాలపు అంతరిక్షాన్న అప్పుడే ప్రారంభించినట్టుంది ఇవాళ.

డాక్టర్

అవుతూ ఉండనీ వాయిద్యం——కొంచంనాడి చూడనీ గుండే, అదీ, పరీక్ష చెయ్యనీ——బూందీ మిఠాయి అంతా పురమాయించాలి గదా, ఈలోపున ఈ చిల్లర పనులు—— అవసరం లేదు గాని——పూర్తి చేసేసుకుందాము——ఏమంటావు జ్యోతీన్.

జ్యోతీన్

నాడి ఉండక ఎక్కడికి పోతుంది? చూడడం వల్ల ఏమి ప్రయోజనం?

డాక్టర్

అబ్బే, ఏమీ లేదు ఏమీ లేదు, ఏదో మనస్సు కొంచం సమాధానం చేసుకోడానికి ఇవన్నీను. మేము ధన్వంత్రి వేషం వేసుకొని రోగిగుండె మీదా వీపుమీదా ఈపక్కనూ ఆపక్కనూ జేబులోనూ చెయ్యివేసి చూస్తూ ఉంటా

ము, యమధర్మరాజు అక్కడ కూర్చొని నవ్వుతూ ఉం టాడు. ఒక్క డాక్టర్ తప్ప ఇంకెవరూ ఆయమధర్మరాజు గాంభీర్యం వదలించ లేరు. అమ్మా హిమీ, నువ్వు ఆపక్క గదిలోకి వెళ్లి ఏదైనా మంచి పాట ఒకటి పాడమ్మా పక్షి లాగు పాడాలి-నేనొక పుస్తకం రాస్తున్నాను, అందులో కనపరుస్తాను: సంగీతం తాలూకు తరంగాలు వస్తే గాలిలో ఉండే రుగ్మతలన్నీ ఎలాగు కొట్టుకు పోతాయో. రోగా లన్నీ చెడిన రాగాలు, తాళం తప్పినవి. తాళం తప్పిన వన్నీ బేతాళబృందమే గదా! వాటి వల్లనే మనదేహం తాలూకు లయ తప్పుతుంది—వెళ్లు తల్లీ, కొంచం కంఠం ఎత్తి మంచి పాట ఒకటి పాడు.

హిమి

ఏపాట పాడేది అన్నయ్యా?

జోతీన్

ఆ కొత్త పెళ్లిపాట.

డాక్టర్

ఆఁ, ఆఁ, అది బాగుంటుంది. ఇవాళ ఒకలగ్నంకూడా ఉంది. దారిలో పెళ్లివాళ్ల ఊరేగింపులు మూడు దాటి రావలసి వచ్చింది, అందుకే ఈ ఆలస్యం. (పక్క గదిలోకి వెళ్లి హిమి పాడుతుంది)

(పక్క గదిలో—డాక్టర్, పిన్ని)

డాక్టర్

నిజమేదో తెలిసి ఉండడం మంచిది. రాబోయే కష్టం మరి తప్పించ లేమని తెలిసినప్పుడు అనుభవించ డానికి సిద్ధంగా ఉండడమే మంచిది; మనస్సు భ్రమపెట్టుకొని మోస పోవడం వల్ల ఆదుఃఖాన్ని మరింత పెద్దది చేసిన వాళ్లము అవుతాము.

పిన్ని

డాక్టర్, ఇన్ని మాట లెందుకు?

డాక్టర్

నేను చెప్పేది—మీరు కొంచం గుండెదిట్ట పరుచు కొని ఉండాలి అని.

పిన్ని

డాక్టర్, నోటి మాటలు రెండిటివల్ల నాకుధైర్యం చెప్పి సిద్ధం చేసి ఉంచాలని అనుకుంటున్నావు కాబోలు. నాకు పద్ధెనిమిదేళ్లు వచ్చేసరికి భగవంతుడు కావలసినంత ధైర్యము చెప్పి ఉంచాడు—బట్టీలో ఇటికలు కాల్చి తయారు చేసి ఉంచినట్టు. నా బ్రతుకు బద్దలు కావడానికి కావలసినదంతా చాలాకాలం నుంచి తయారవుతూ

ఉంది—పునాది దగ్గరనుంచి అంతా తయారయి ఉంది. ఆఖరిది కొంచం ఏమాత్రమో బాకీ ఉంది చెప్ప వలసిన దంతా భగవంతుడు నాకు అతిస్పష్టంగా చెప్పే ఉంచాడు. నువ్వ డొంకతిరుగుడుగా చెప్తావెందుకు అబ్బాయి.

డాక్టర్

జోతీన్ మీాద మరి ఆశ ఉంచుకో కూడదు; ఇక ఏనాలుగు రోజులో—

పిన్ని

నాకామాట తెలుసును. ఈఆఖరి నాలుగు రోజుల సంసార తాపత్రయాలూ అయిపోని, తరవాత నామీాద దయ ఉంటే ఈచివర దశలో భగవంతుడు నన్ను కేవలం తన పనిమీాదనే పెట్టుకుంటాడు.

డాక్టర్

ఔషధమేమో కొంచం మూర్చాను. ఇప్పుడు మనం చెయ్యవలసినదంతా అతని మనస్సెప్పుడూ ఉత్సాహంగా ఉంచడం. మనస్సుకంటే మంచి డాక్టర్ మరిలేదు.

పిన్ని

మనస్సా! ఈశ్వరా! నేను చెయ్యగలిగినదంతా చేస్తున్నాను.

డాక్టర్

మీ కోడలిని మధ్య మధ్యను జబ్బుగదిలోకి వెళ్లనిస్తూ ఉండాలి—తరుచుగా ఆమెను పాపం అతని దగ్గిరికి రానీయకుండా ఆపుచేస్తూ ఉన్నట్టు ఉంది.

పిన్ని

వెయ్యి చెప్పు, లక్ష చెప్పు—చిన్నపిల్ల, జబ్బుమనిషి సేవ, పాపం, ఎంతని చెయ్యగలదు!

డాక్టర్

అలాగంటే ఎలాగు చెప్పండి, మీరుమట్టుకు కొంచం అన్యాయం చేస్తున్నారు ఆమెమనస్సు అంతనిస్సత్తువైనది కాదు. ఇంత గొప్పదుఃఖం నెత్తిమీద పడడానికి సిద్ధంగా ఉన్నా గుండె బద్దలైపోకుండా నిలబెట్టుకొని తిరుగుతూ ఉంది.

పిన్ని

గాని లోలోపున ఎంత—

డాక్టర్

నేను డాక్టర్‌ను. నేను చూసేది రోగిబాధ-అంతే నాకు కావలసినది. జబ్బులేనివాళ్లుపడే బాధ గురించి ఆలో

చించడం నాపనికాదు పోనీ, కోడలిని ఇక్కడికొక్క మారు పిలవండి, నేను ఆమెతో చెప్పి వెళ్తాను.

పిన్ని

పోనీ అవసరం లేదు లెండి. నేనే ఆమెను—

డాక్టర్

చూడండి, మనుష్యుల సంగతి కని పెట్టడానికి మాకు, డాక్టర్లకు, చాలా అవకాశాలుంటాయి. కోడలంటే అత్త గారికి ఎలాగైనా సహజంగా కొంచం ఈసు ఉంటుంది—ఎంత ఆపదసమయంలోనైనా అది వదిలి పెట్టలేరు. సేవ చేసి మీఅబ్బాయిమనస్సు తనవేపు మరలించేసుకుంటుందేమోఅని కాబోలు—

పిన్ని

మీరు చెప్పినది అబద్ధంకాదు. ఈసు ఏమో ఉండవచ్చును. మనస్సులో దాగి ఉన్న పాపాలన్నీ భగవంతుడికి తప్ప మరెవరికి తెలుస్తాయి.

డాక్టర్

ఒక్క అక్కకొడుకేనా మీకు కావలసినది, కోడలు విషయంలో మాత్రం చెయ్యవలసినది లేదూ? మీరే ఆమె అనుకొని కొంచం ఆలోచించి చూడండి, ఏలాగుం

టుందో. వది త్తే చాలును—ఎలాగైనా గదిలోకి వెళదా పాపం, ఆపిల్ల మనస్సు కొట్టుకుపోతూ ఉంటుంది.

పిన్ని

నాకు ఏలాగైనా జ్ఞానం తక్కువ గదా, అంత మట్టు కు నేను ఆలోచించి చూడలేదు సుమండి.

డాక్టర్

చూశారూ, నేను నిర్మొగమాటంగా, ఉన్నది ఉన్న ట్టు చెప్పవలసిన మనిషిని. మీరేమీ అనుకోకూడదు సు మండీ.

పిన్ని

ఎందుకనుకోవడం డాక్టర్, తప్పు చూపించకపోతే ఎలాగు తిన్నబడుతుంది బుద్ధి, వంకరగా ఉన్నప్పుడు? ను వ్వన్నమాట జ్ఞాపకం ఉంచుకుంటాను, భయపడకు. (డాక్టర్ వె.) హేమీ, ఏమి చేస్తున్నావమ్మా!

హేమి

అన్నయ్యకోసం పాలు మరగబెటుతున్నాను.

పిన్ని

ఆపాలు నేను మరగబెడతానుగాని నువ్వు కొంచం

వెళ్లి అన్నయ్య దగ్గిర ఏదైనా మంచి పాట పాడమ్మా. పా
ట వింటూ ఉంటే కొంచం నిద్ర వస్తుంది వాడికి.

(పొరుగావిడ ప్ర.)

పొరుగావిడ

అక్కా, జ్యోతీన్ వంట్లో ఏలాగుంది ఇవాళ ?

పిన్ని

ఏమీ బాగులేదు, సురో.

పొరుగావిడ

నామాట విను అక్కా—ఒక్క మాటు మన జొగు డాక్టరికి చూపించుమీ చూదాం మా మనవరాలికి ముక్కు వాచిపోయి పెట్టిందికదా బాధ—ఇక మరేమి చెప్పను! చిట్టచివరకు జొగు డాక్టర్ వచ్చి కుడిముక్కు లోనుంచి ఇంత పెద్ద గాజుపూస తీశాడు. అతని చెయ్యి చాలామంచిది. మా అబ్బాయికి అతని ఇల్లు తెలుసును.

పిన్ని

సరే అయితే ఇల్లెక్కడో చెప్పమని చెప్పు

పొరుగావిడ

ఆవేళ మీకోడలిని అలిపూర్ జూ లో చూశానే.

పిన్ని

జంతువులంటే మాకోడలికి చాలాసరదా. తరుచుగా వెళ్తూ ఉంటుంది అక్కడికి.

పొరుగావిడ

జంతువులు సరదాఉంటే మొగుడు మరి అక్కర లేదా ఏమిటి?

పిన్ని

ఎవరన్నారు మొగుడక్కరలేదని, చిన్నపిల్ల గదా— రాత్రింబగళ్లూ జబ్బుమనిషి సేవే చేస్తూఉంటే మరి బ్రతకాలా? మేమే ఆమెను బలవంతాన—

పొరుగావిడ

ఏమైనా అను, చుట్టుపక్కల ఆడవాళ్లంతా మీకోడలి మాట తప్ప—

పిన్ని

ఆ అమ్మలక్కలందరికీ పెళ్లాంకాదు కదా! మాజాతీన్‌కు తెలుసును మాకోడలి మనస్సు ఏలాంటిదో. వాడెప్పుడూ కూడా—

పొరుగావిడ

ఐతే అక్కా, అతనేమీ అనడని ఈవిడ—

పిన్ని

అనకపోవడమేకాదు, ఆవిడ మ్యూజియం చూడడా నికనీ, పుల్లూ సింహాలూ చూడడానికనీ, ఇక్కడికీ అక్క డికీ వెళుతూ ఉంటేనే మావాడికి కొంచం కులాసాగా ఉంటుంది.

పొరుగావిడ

ఏమిటక్కా, నువ్వ అనేమాట! పెనిమిటి సేవ కంటే అది—

పిన్ని

ఆ, వాడనేది మణి చెయ్యవలసిన సేవ అదే అని. తాను మంచంపట్టి కదలలేడా మరి, మణి కొంచం ఇటూ అటూ తిరిగి వస్తూఉంటే తానే తిరిగి వచ్చినట్టుగా ఉం టుంది మావాడికి. జబ్బుమనిషికి ఆమాత్రం కులాసా ఐనా సామాన్యమా ఏమిటి!

పొరుగావిడ

మాకేమి తెలుస్తుందమ్మా,పూర్వకాలంమనుష్యులం— సరేపోనీ. మాపిల్లవాడిని పంపిస్తాను,వాడికిజాగుడాక్టర్ ఇల్లు తెలుసును. ఒకమాటు అతన్ని తీసుకువచ్చి చూపిస్తే నష్టమేముంది.

(పొరుగావిడ వెళు)

(జబ్బుగది—హిమి, జ్యోతీన్)

జ్యోతీన్

ఇదిగో హిమి—వచ్చావుగా, అన్నా, కొంచం ప్రాణం వచ్చినట్టుంది. ఆఫొటోగ్రాఫ్ ఎక్కడుందో వెతకలేను, ఒక్కమాటు చూసి ఇయ్యవూ, చెల్లీ?

హిమి

ఏ ఫొటోగ్రాఫ్ అన్నయ్యా?

జ్యోతీన్

అల్లదీ—బొటానికల్ గార్డెన్సులో మణితో కలిసి తీయించుకున్నాను—ఆ చెట్టు కిందా—

హిమి

అది నీ ఆల్బమ్‌లో ఉండాలి?

జ్యోతీన్

ఇందాక ఆల్బమ్‌లోనుంచి తీశాను, పరుపుమీదో ఎక్కడో ఉండాలి—లేక కింద పడిపోయిందో—

హిమి

ఇల్లిదిగో, అన్నయ్యా, తలగడా కింద.

జ్యోతీన్

ఇంకొకజన్మం సంగతి లాగు జ్ఞాపకం వస్తూఉంది చెల్లీ. అల్లా వేపచెట్టుకిందా—మణికుసుంబా రంగు చీర కట్టుకుంది; సిగ మెడమీద—కిందికి—వేసుకుంది; ఎక్కడనుంచో కూతవినబడుతూ ఉంది, 'బౌవ్ కొథా కొవ్' (అనే) పక్షి—ఆ దేవరసపెట్టి పిలుస్తూఉంది. ఏరు నిండావచ్చింది—ఓహ్,అప్పుడేని టా గాలీ—ఝా ఝా మని ఆ సబుకుచెట్టూ మణి ఆ చెట్ల పళ్లన్నీ ఏరి పోగుచేసి వాటి తొక్కవల్చి వాసనచూస్తూఉంది—తనకు ఆ వాసన ఎంతో ఇష్టం అని అన్నది. మణికి ఇష్టంలేనిది ఎమిటి ఉన్నదో నాకు తెయలిదు. ఆవిడకు అలాగు ఇష్టం ఉండడం చేతనే ప్రపంచాన్ని అనేకంగా నేను అనుభవించాను—ఆవాళ పాడేవు, ఆపాట పాడవ్రూ హిమీ, నా బంగారు తల్లివి— జ్ఞాపకం ఉందా?

హిమి

ఆహా, జ్ఞాపకం ఉంది.

(హిమి పాట)

జ్యోతీన్

ఆవాళ ఆచెట్ల ప్రదేశం అంతా మాట్లాడడం ప్రారంభించింది. ఇవాళ, ఈగోడలమధ్యనో! ప్రపంచం అం

తా ఘోరమైన నిశ్శబ్దంతో నిండిపోయినట్టుగా ఉంది. ఈగోడలు భూమితాలూకు పాలిపోయిన పెదివలు లాగు కనబడుతున్నాయి నాకు——హిమీ, దీపం మరికొంచం తగ్గించవు——ఇటు పక్కా చెట్టుచెట్టునా పచ్చని ఆకుల గుత్తులు పొంగిపొర్లివస్తూ ఉన్నట్టుగా ఆకాశమంతా నిండిపోయి ఉన్నాయి. అటుపక్కా ఫ్యాక్టరీ చిమ్నీలో నుంచి పొగ చుట్టలుచుట్టలుగా వస్తూ ఉంది——ఎంత తమాషా రంగు దానిది! ఏమిటా ఆచుట్టచుట్టలు, ఎంత వింతగా ఉండెను అదంతా !——తరవాత, ఆకుక్కా——జ్ఞాపకం లేదూ ? మణి మాటిమాటికి బంతి నీళ్లల్లోకి విసురుతూ ఉంటే అది ఈదుకు వెళ్లి——

హిమి

సరేగాని అన్నయ్యా, నువ్వు మాట్లాడ కూడదు మరి.

జ్యోతీన్

పోనీ అలాగే మరి మాట్లాడను. కళ్లు మూసుకొని వింటూ ఉంటాను, ఆసబుకు చెట్ల ఝూ ఝూ శబ్దం——గాని నువ్వు ఇవాళ పాడేవు పాట, సరిగా అలాగే ఉంది హిమీ, కదూ?——గాని ఎవరు చెప్పగలరు సరిగ?——మరి కొంచం చీకటి పడితే నీమట్టుకు నువ్వే వింటావు "ధీరె

బవ్ ధీరెబవ్ సమీరణ్'' అన్నట్టు శబ్దం.— సరే
నమ్మా, నువ్వు వెళ్లు. ఆ ఫొటో ఎక్కడుంచాను?

హిమి

ఇదుగో.

(హిమి వెళు.)

(పక్కగదిలో—పిన్ని, అఖిల్)

అఖిల్

రమ్మని కబురు పంపించావట, ఎందుకు కక్కి?

పిన్ని

బాబూ నువ్వు వకీలువు, నాకు కొంచం సహాయం చే
సి పెట్టాలి.

అఖిల్

వాళ్లేమో మరి ఆగలేరు. డిక్రీ పొందారు, తక్కిన
చర్య—

పిన్ని

అట్టే రోజులు ఆగనక్కరలేదు. వాళ్ళు నీ పార్టీలేకదా,
వాళ్లకు కొంచం బోధపరిచి చెపుదూ, డాక్టరేమో—

అఖిల్

డాక్టర్ ఇంతకు ముందు ఒక మాటు చెప్పాడు. ఈ

మారు మరి నమ్మరు అతనిమాట. గాని తనఖాగా ఉంచి ఇల్లు కట్టించడం ఏమిటీబుద్ధి జొతీన్‌ది, నాకు తెలియకుండా ఉంది చెప్పమీ.

పిన్ని

తప్పు లేదు, వాడిదేమీ తప్పు లేదు. వాడిబుర్రలో బుద్ధి లేదు; అందులో మణి శని అయి కూర్చుంది. ఈ మెరుగుడుపురుగుని పట్టుకొని ఇటికల పంజరంలో ఉంచుదామని అనుకున్నాడు.

అఖిల్

అతని దగ్గిర నగదేదో కొంత ఉండాలే?

పిన్ని

అదంతా నారవర్తకంలో పెట్టేశాడు.

అఖిల్

వహ్, జొతీన్ నారవర్తకం! కలంతో భూమి దున్నినలాగే! ఇది చూసి నవ్వడమా ఏడవడమా?

పిన్ని

అసాధ్యపు ఖర్చులన్నీ చేదామనికూర్చున్నాడు; నార వ్యాపారం చేస్తే లాభం వస్తుంది, త్వరగా డబ్బు

పోగుచేసేయవచ్చును అని అనుకున్నాడు. ఫ్రుండుసంగతి తెలియగానే ఎక్కడెక్కడినుంచో ఈగలు వచ్చి పోగైన ట్టుగా చెడిపోయేకాలం దగ్గిరికి వచ్చేసరికి పాడు బుద్ధు లన్నీ సమకూడుతాయి.

అఖిల్

ఘోరం, ఘోరం! ఇప్పుడు ధర ఎలాగున్నది తెలుసునా? మళ్ళల్లో ఉన్న నార కోయిస్తే కోతకూలి కూడా కిట్టదు.

పిన్ని

పోనీ పోనీ, మరెందుకా మాటలన్నీ— తలచుకోవడం కూడా మరి అవసరం ఉండదు. రోజులు నిండిపోయినాయి.

అఖిల్

అప్పుల వాళ్ళకు ఇతని నారవర్తకం సంగతి తెలిసిందనుకుంటాను. రాబందులన్నీ చేరాయి ఒక్కచోట— ఎవడిడబ్బు వాడు లాగేద్దామని ఎత్తులు వేస్తూన్నారు.

పిన్ని

ఒరే అఖిల్, ఎలాగైనా చెప్పుమీ ఒక్కరోజు ఆగమని. యమదూతలతో కోర్టువాళ్లు పోటీగా రాకుండా

చూడమ్మా, ఎలాగైనా. లేకపోతే వాళ్ళ దగ్గిరికి తీసుకు వెళ్లు నన్ను, బ్రాహ్మణ మనిషినికదా, వాళ్ల కాళ్లమీాదపడి నెత్తి మొత్తుకుంటాను.

అఖిల్

సరే, వాళ్లతో ఒకమారు మాట్లాడి చూస్తాను, అవసరం ఉంటే నువ్వు వెళుదువు గాని—జ్యోతీన్‌ను చూసి వెళ్తాను ఒక్కమాటు.

పిన్ని

వద్దు బాబూ వద్దు. నిన్ను చూసేసరికి నార వ్యాపారం జ్ఞాపకం వస్తుంది, వాడికి.

అఖిల్

సరే ఐతే—గాని అతను మణిపేరను ఎన్నో కొన్ని వేలకు భీమా కట్టాడే, అదేమయింది?

పిన్ని

ఎన్ని తంటాలు పడైనా అదిమాత్రం నిలిపి ఉంచాను. నాదేదో కొంత ఉండేది, అదీ అయిపోయింది దాని లోనే. తరవాతమరి డాక్టర్ ఖర్చులో? జ్యోతీన్‌ను మరి ఉంచలేనుగాని వాడి ఈదానం మాత్రం నిలిపి ఉంచగలిగాను; నామనస్సుకు దక్కే సౌఖ్యం అదొక్కటే.

వాయిదావాయిదాకు ఇన్స్యూరెన్సు సొమ్ము జతపరిచే టప్పుడు నేను పడుతూఉండే అవస్థ జ్ఞాపకంఉందా? అడు క్కుంటాను బాబూ నీపార్టీ వాళ్లతో చెప్పి ఎలాగైనా——

అఖిల్

చూడు కక్కీ, నేను నిజం చెప్తున్నాను, అతనిమీద నాకు ఒక్కపిసరైనా దాక్షిణ్యం లేదు. ఏమిటీ తెలివి తక్కువ వ్యవహారం, పాదుషాలను మించిపోయిందే!

పిన్ని

గాని వాడి మీద దేవుడికి ఎంత దయో ఒక్కసారి చూడు, ప్రాణమంతా పెట్టి ఇల్లు కట్టాలని భీష్మించు కున్నాడు, ఇల్లు పూర్తికాలేదు సరే గాని, వాడి ఆట జట్టుగాడు ఈ విరిగి పోయిన ఆటవస్తువులన్నీ పోగుచేసి తనకూడా వాడిని తీసుకు పోతున్నాడు ఏఆ ట ఆడుకోడానికో ఎవరికీ తెలియదు కదా!

అఖిల్

కక్కీ దేవునిధర్మమా అని మా 'లా'పుస్తకాలలో ఈ ఆట సంగతులేవీ రాసి ఉండవు. అందు చేతనే రెండు మెతుకులు ఎక్కడో కూడబెట్టుకొని తినగలుగుతు న్నాము. లేకపోతే ఇలాగే ఆట గాలిలో కొట్టుకు పోయి ఏదివాలారేవులోనో తేలి ఉందుము.

(అఖిల్ వెళ.)

(మణి ప్ర.)

పిన్ని

అమ్మాయీ, మీ అమ్మగారి ఇంటిదగ్గిర నుంచి యే మైన కబురు వచ్చిందా? మీ పింతండ్రికొడుకు, అనాథ్, కనబడ్డాడు కదా అని——

మణి

ఆ, అమ్మ చెప్పి పంపింది——వచ్చే శుక్రవారం మా చిన్న చెల్లి అన్నముహూర్తం. అందుకని నేను——

పిన్ని

భేష్, ఐతే అమ్మా, ఒక చిన్న బంగారం హారం లాంటిది చేయించి పంపించు, మీ అమ్మ సంతోషిస్తుంది.

మణి

నేను వెళదామని అనుకుంటున్నాను. మాచిన్న చెల్లిని నేను చూడనైనా చూడలేదు. చూడాలని సరదాగా ఉంది.

పిన్ని

ఓయి బాబు, ఏమిటామాట! జ్యోతీన్‌ను ఒక్కడినే వదిలిపెట్టి వెళిపోతావా!

మణి

తిరిగిరావడం అట్టే ఆలస్యం కాదు.

పిన్ని

ఆలస్యం అవుతుందో కాదో ఎవరు చెప్పగలరమ్మా! కాలం మనచేతిలో ఉందా ఏమిటి? రెప్పపాటులో మించిపోతుంది ఒకొక్కప్పుడు

మణి

ముగ్గురు మొగపిల్లల తరవాత ఆడపిల్ల; అతిముద్దుగా చూస్తున్నారు. ఎంతో సందడిగా అన్నప్రాశన చేస్తారట. నేను వెళ్లక పోతే అమ్మకు మనస్సేమీ—

పిన్ని

మీ అమ్మమనస్సు ఎలాంటిదో నాకేమే తెలియదుతల్లీ! తల్లిప్రాణం చుట్టూ కన్నీటి సముద్రాలు ఏడు. మీ అమ్మ దికూడా ఆతల్లి జాతేనా? ఇంత గొప్పభయంకరమైన ఆపద నెత్తిమీద పడడానికి సిద్ధంగా ఉంటే ఏమని అంత త్వరగా నిన్ను రమ్మని కబురు పంపించేసింది? ఒకరి ఆపదంటే అంత—

మణి

చూడత్తా, మా అమ్మమీద నిందవేసి మాట్లాడవద్దు,

చెప్తున్నాను. నువ్వు అత్తగారివైతే ఊరుకుందు నేమో గాని—

పిన్ని

పోనీ తల్లీ, అపరాధం అయింది, నన్ను క్షమించు. నేను అత్తగారినయి నిన్ను ఏమే అనలేదు. ఏమీ సంబంధం లేని ఏ ఆడదో అడుక్కున్నట్టుగా నిన్ను అడుక్కుంటున్నాను, జోతీ! వంట్లో ఇలాగు ఉంటున్నపుడు వెళ్ళకమ్మా అని. వెళ్ళావా అంటే మీ నాన్నకు నీమీద తప్పకుండా కోపంవస్తుంది. అదినాకు బాగా తెలుసును.

మణి

నాకూ తెలుసును. అయితే ఒక చిన్నఉత్తరం, నాలుగు ముక్కలు రాసి ఇవ్వాలి. అందులో ఏమని రాస్తావంటే నేను వెళ్ళడంవల్ల ఏమీ—

పిన్ని

నువ్వు వెళితే ఏమీ లోకైపోదు, ఆమాట నాకు తెలియదా ఏమిటి? గాని, మీనాన్నకు రాయవలసేవస్తే, నామనస్సులో ఉండేదేదో స్పష్టంగా చెప్పి మరీ రాస్తాను.

మణి

సరే సరే! నువ్వేమీ రాయనక్కర లేదులే—
నేను వెళ్లి ఆయనతో చెప్పానంటే ఆయనే—

పిన్ని

చూడు మణి, చాలా ఓర్చి ఊరుకున్నాను. జోతీన్ దగ్గిరికిగాని దీనికని వెళ్లావా అంటే నేను ఎంతమాత్రం ఊరుకోను, జాగ్రత్త.

మణి

సరే, అక్కరలేదు నీ ఉత్తరం. మానాన్నగారింటికి వెళ్తానంటే ఇంతగోలెందుకో! ఆయన జర్మనీ వెళ్తానను కున్నప్పుడుకదా పాస్‌పోర్టు కావలసి వచ్చింది—నాన్న గారిల్లు జర్మనీయా ఏమిటి?

పిన్ని

పోనీ తల్లీ, నీధర్మం ఉంటుంది, అంతగట్టిగా మాట్లా డకు. అదుగో పిలుస్తున్నట్టున్నాడు—ఇదుగో వచ్చా. జోతీన్—ఇదేమైనా వినబడ్డదో ఏమిటో!

(అందరూ వెళ.)

జ్యోతీన్ గది

పిన్ని

పిల్చావా జ్యోతీన్?

జ్యోతీన్

ఆ, పిల్చాను పిన్నీ. నిద్ర పోతూ పోతూ ఉండగా నాకు తట్టింది: నేనేమో ఖైదీనట; విడుదలమార్గం లేదు, ఈ బోనులో పడిపోయినాను, రోగంలో—ఈగోడల మధ్యను ఖైదీని. గాని నాతోపాటు మణికి కూడా ఖైదెందుకు ?

పిన్ని

ఏమిటి జ్యోతీన్ నువ్వనే మాట! చాలా అసందర్భంగా ఉంది సుమా. నీ బ్రతుకు తోనే కదూ దాని బ్రతుకుకు ముడి. నువ్వు ఇప్పుడు విప్పేదామంటే మాత్రం విడిపోతుందా ఏమిటి ఆముడి ?

జ్యోతీన్

మునుపుండేది పద్ధతి—మొగుడు చస్తే పెళ్లాం చావాలి అని—సహగమనం. ఆ పద్ధతి పోయింది ఇప్పుడు, అన్యాయం గనుక. గాని మణికి ఇప్పుడు క్షణక్షణానికి చావే, బ్రతికిఉంటూ మరీ సహగమనం. తలచుకుంటే

నాకు ఉక్కిరిబిక్కిరయిపోతూ ఉంటుంది. ఈ చరనుంచి విడిచిపెట్టేయి పిన్నీ, మణిని విడిచిపెట్టేయి.

పిన్ని

ఇవాళ ఏమిటలాగు ఛటీమని మట్లాడు తున్నావు జోతీన్! నిద్రమత్తున ఒక మాట అంటే ఇంకొక మాట లాగు నీకు వినబడ్డదో ఏమిటో!



జోతీన్

అబ్బెబ్బె, చాలా సేపటిబట్టీ తలచుకుంటున్నాను—ఆ సంగీతపు చెట్టు తాలుకు ఝూ ఝూ శబ్దం, ఏటితాలూకు వరదలూ, దూరంనుంచి 'బౌవ్ కొథా కొవ్' పక్షీ కూతా—జ్ఞాపకం వచ్చాయి, ఇంకేవో అన్నీ: మణి కుసుంబారంగు చీరా, కుక్కతో ఆ ఆటా, కారణం లేకుండా ఆ నవ్వూ అవన్నీనూ. నిండు ప్రాణం, పాపం! ఏమిటీ ప్రాణం లేని గోడలమధ్యను. మరికట్టిపెట్టకు, సెలవిచ్చేయి పిన్నీ. ఎన్నాళ్లయింది మణి నవ్వుఅన్నది విని! ఆమెజీవన ప్రవాహం తాలూకు వడిని ఈమందు సీసాలూ ఈపథ్యాలు గిన్నెలూ అడ్డుపెట్టి అటకాయించడం ఎంత అన్యాయం, ఎంత ఘోరం!

పిన్ని

ఏమీ లేదు, ఏమాత్రం అన్యాయమూ లేదు. ప్రాణం నిండుగా ఉన్నవాళ్లే ప్రాణం ఇవ్వగలరు—నిండు మేఘాలనుంచే కదా వర్షం—లేచి కూర్చోకు జ్యోతీన్, పడుకో, అలాగు గాభరాపడకు—ఎక్కడికి మణిని పంపించమంటావు కదా, చెప్పమీ, నాకు తెలియకుండా ఉంది.

జ్యోతీన్

పోనీ, లేకపోతే వాళ్ల నాన్నగారింటికి...మరిచిపోయినాను, ఎక్కడ ఇప్పుడు వాళ్లనాన్నగారు...

పిన్ని

సీతారాంపూర్ లో.

జ్యోతీన్

ఆఁ, ఔను, సీతారాంపూర్ లో. అక్కడంతా బయలుగాను విరివిగాను ఉంటుంది—ఆఁ, ఆఁ,పంపించేయిఅక్కడికి పంపించేయి.

పిన్ని

నేను చెప్పిన మాట వినిపించుకోవేమి? నీవంట్లో అలాగు ఉంటూ ఉంటే నిన్ను వదిలిపెట్టి వెళ్ల గలదూ! ఏమి టామాట!

జ్యోతీన్

డాక్టర్ అన్న మాట గాని మణి...

పిన్ని

ఏమో వినడం లేదులే గాని, కళ్లతో చూస్తూ ఉండడం లేదూ? ఆవాళ వాళ్ల నాన్నగారింటికి వెళ్లడంమాట కొంచం సూచావాచా అనేసరికి వెక్కి-వెక్కి ఏడవడం ఆరంభించింది గదా...

జ్యోతీన్

నిజమే పిన్నీ? మణి ఏడ్చిందీ? నిజంగా? నువ్వు చూశావా?

పిన్ని

లేచి కూచోకు జ్యోతీన్, కూచోకు కూచోకు, పడుకో. కొట్టుగది తలుపు గొళ్లెంపెట్టడం మరిచి పోయి నాను, కుక్కలు దూరుతాయి. నేను వెళతాను, నువ్వు కాస్సేపు పడుకోఅమ్మా.

జ్యోతీన్

ఇక నేను తప్పకుండా పడుకుంటాను. మరేమీ భయపడకు. గాని ఒక్క మాట పిన్నీ—గృహప్రవేశానికి మంచిరోజు నిశ్చయంచేసేయన్వా?

పిన్ని

ఏమిటి జ్యోతీన్ నువ్వనేది—ఒంట్లో ఇలాగు ఉంటూ ఉంటే—

జ్యోతీన్

మీరు నమ్మరుగాని, గృహప్రవేశం చేయవలసిన రోజు వచ్చింది అని నామనస్సు అంటూఉంది. నేనులేచి రాగలను, నిజంగా రాగలను. ఇప్పటినుంచి అన్నీ సిద్ధం చెయ్యాలి, సమయానికి ఏదీ లోటు ఉండకుండా.

పిన్ని

చేస్తాము. అదంతా మేము చూస్తాములే, నువ్వేమీ భయపడకు.

జ్యోతీన్

ముహూర్తం మణితో కూడా చెప్పిఉంచు. మణిచే యవలసిన పని చాలాఉంది.

పిన్ని

ఆహా, ఉంది, సందేహమేమిటి.

జ్యోతీన్

నువ్వు మా వధూవరులనిద్దరినీ ముస్తాబుచేసి గృహప్రవేశానికి తీసుకొని వెళ్తావుకదూ గాని పిన్నీ. నాకొక

మాట మాటిమాటికి జ్ఞాపకం వస్తూఉంది, భయంచేత ఎవరినీ అడగలేకుండా ఉన్నాను. నీకేమైనా తెలుసునూ, నార ధర గాని ఈమధ్య ఎక్కిందేమో?

పిన్ని

నాకు సరిగా తెలియదు. అఖిల్ ఏదో అంటూఉండెను. దానిమాట.

జాతీన్

ఏమిటేమిటి, ఏమిటన్నాఁడు? నిన్ను భయపెట్టాలని లేదు గాని ఒకమాటమాత్రం నిశ్చయం. ధరగాని హెచ్చకపోతే...

పిన్ని

ఏమిటి కాబోతుంది కదా!

జాతీన్

నా ఇల్లు, ఇది, ఒక్కనిమిషంలో అదృశ్యమైపోతుంది ఎండమావులలాగు...అదుగో అదుగో అడితి గుమాస్తా!--నరహరి! నరహరి!

పిన్ని

జాతీన్ అలాగు కేకలు వెయ్యకు—ఆహా, నా కెప్పుడు

వస్తుందో ఆ చావు!—నెమ్మదిగా కొంచం పడుకో, నేను వెళ్లి మణితో ఒక్కమాట చెప్పి వస్తాను.

జాతీన్

నాకు భయం వేస్తుంది పిన్నీ, బజారు ధర ఏమీ బాగులేకపోతేమాత్రం నువ్వు ఎలాగైనా అఖిల్‌తో చెప్పి—

పిన్ని

సరే అఖిల్‌తో మాట్లాడతాను, గాని నువ్వు కొంచం—

జాతీన్

నీకు తెలుసునూ పిన్నీ, నేను బదులు తెచ్చిన రూపాయిలు అఖిల్‌వే. ఇంకెవరి పేరో పెట్టి—

పిన్ని

నేనూ అది పోల్చుకున్నాను ఊహ వల్ల.

జాతీన్

గాని చూడు పిన్నీ, సరహరిని నాదగ్గిరికి రానివ్వకు. వాడేమైనా చెప్పేస్తాడేమో అని భయంవేస్తూ ఉంది. నేను వినలేను. అతనిని అఖిల్ దగ్గిరికి తీసుకు వెళ్లు.

పిన్ని

అలాగే, వెళ్తానులే.

జ్యోతీన్

మన ఇంట్లో పంచాంగం ఉంటే పంపించవ్వూ ఒక మారు.

పిన్ని

పంచాంగంమాట అటుండనీ. కాస్సేపు నువ్వు పడుకో అమ్మా.

జ్యోతీన్

మణి అమ్మగారింటికి వెళ్ళడం అనేసరికి ఏడిచిందీ! ఏమి ఆశ్చర్యం!

పిన్ని

ఆశ్చర్యానికి ఏముంది అందులో.

జ్యోతీన్

నా మణి ఊర్వసి లాంటిది—చావు అనే మాటైనా వినని ప్రదేశం, అమరావతి, ఆవిడ ఉండే దేశం. అటు వంటి మనిషిని తీసుకువచ్చి ఆసుపత్రిఆయాగా చేసేయాలని చూస్తున్నారు!

పిన్ని

ఏమిటి జ్యోతీన్, ఆమెను ఒక పతం లాగు చూస్తుకుంటూ ఉంచాలనా ఏమిటి అనుకుంటున్నావు? పతం లాగు గోడకు వేలగట్టి ఉంచుతావా !

జ్యోతీన్

అందులో తప్పేమి ఉంది? పతం అంటే ప్రపంచంలో సులభంగా దొరికే వస్తువనుకుంటున్నావేమో! చూడదగిన వస్తువు చూసే భాగ్యం లభించడం, ఏమి, సామాన్యమా ఏమిటి? సరే అది అలాగుండనీ గాని, నువ్వన్నావు కదూ మణి ఏడ్చిందని? చూశావూ, లక్ష్మి ఆసనం పద్మం: అది పరిమళం వెదజల్లుతూ ఉంటే అందులో వాయువుతాలూకు కన్నీరు ఉండదూ !

పిన్ని

ఆడవాళ్లు సేవ చెయ్యకుండా ఉండడం, అది ఒక—

జ్యోతీన్

షాజహాన్ కోటలో ఇంటిచాకిరీ చేసే వాళ్లు అనేక మంది ఉండేవారు. వాళ్లందరి మధ్యా ఏపనీ లేనిది ఒక స్త్రీ కనబడ్డది అతనికి. లేకపోతే తాజ్ మహాల్ మాట అతనికి

తట్టకే పోను—ఏ విధంగా చూసినా తాజ్ మహల్ ఒక అవసరమైన వస్తువు కాదు.

నాజబ్బు పోతేనేమ్ పిన్నీ, తిరిగి ఇంటిపనిలో పడతాను. బ్రతికి నేను చేయవలసిన పని ఒక్కటే—ఈ ఇల్లు పూర్తి చేయిస్తూ ఉండడం—ఇది, నామణి సౌధం. నా స్వప్నం ఈ సుందరమైన సౌధం రూపంగా నెరవేర్చుకుంటాను. ఈ విధంగా సాక్షాత్ నాకళ్లతో నేను చూసిన ఆ భగవంతుడి స్వప్నం నెరవేర్చి తీరుతాను. పిన్నీ, బహుశా నేను చెప్పేదంతా నీకు బాగా బోధపడడం లేదేమో ?

పిన్ని

అది నిజమే నాయనా, మీ మొగవాళ్ల మాటలు నాకు బాగా బోధపడవు.

జాతీన్

ఆ కిటికీ మరికొంచం తెరిచేయి పిన్నీ. (పిన్ని కిటికీ బాగా తెరుస్తుంది.) అదిగో చూడు, అదిగో చూడు, పిన్నీ—అనాదిగా ఉన్న ఆ అంధకారంతాలూకు కన్నీటి బొట్లే చుక్కలై ఉన్నాయి.—హిమి ఎక్కడ పిన్నీ, పడుకోడానికి వెళ్లింది గాబోలు, పాపం.

పిన్ని

లేదు అప్టే రాత్రి కాలేదు ఇంకా—హిమీ, ఒక్క మాటు ఇలాగు వచ్చివెళ్లమ్మా.

(హిమి ప్ర.)

జ్యోతీన్

నన్ను పాడవద్దన్నారుకదా అని నిన్ను మాటి మాటికి పిలుస్తున్నాను. నువ్వేమి అనుకోకుమా చెల్లీ.

హిమి

లేదన్నయ్యా, నీకు మాత్రం తెలియదూ నాకు పాడడం అంటే ఎంతో సరదా అని. ఏపాట వినాలని ఉన్నది, చెప్పు.

జ్యోతీన్

అల్లది—"ఆమార్ మన్ చేయె రొయ్."

హిమిపాట.

జ్యోతీన్

పిన్నీ, మీరంతా అనుకుంటూ ఉండేవారు, మణి బుద్ధి చంచలమయినది, మన ఇంటి వేపు దృష్టి లేనిది అని— గాని చూడు ఇప్పుడు—

పిన్ని

లేదు నాయనా, పొరపాటు. సమయం వచ్చినప్పుడు కదా మనుష్యుల సంగతి తెలుస్తుంది.

జ్యోతీన్

మణివల్ల నాకు సుఖం ఉండదనుకున్నారు, అందుచేత నే మీ అందరికీ ఆవిడంటే కోపంగా ఉండేది. గాని సుఖం అనే వస్తువు, అదిగో, ఆనక్షత్రాలవంటిది. తళుక్ తళుక్ మని చీకటిలోనుంచి మధ్యమధ్య కనబడుతూ ఉంటుంది. అలాగునే మన జీవనంలో అప్పుడప్పుడు స్వర్గంతాలూకు కాంతి కనబడడం లేదూ!—నాకు దొరక వలసినదంతా దొరికింది, అందులో అనవలసినదేమీ లేదు. గాని పిన్నీ, మణి వయస్సు అల్పం, ఏమని మనము ఇక్కడ కట్టి పెట్టి—

పిన్ని

అల్ప వయస్సా! ఆ వయస్సువచ్చే సరికి నేను పైనుం డే దేవుళ్ళు, సంసార సౌఖ్యా లన్నిటినీ విడిచిపెట్టి, మనస్సు లో ఉండే దేవుడినే పూజించడం ప్రారంభించాను. దాని వల్ల నాకేమిటి తక్కువయిందికదా? అందుచేతనే నేననేది —సౌఖ్యంకోసం అంత తాపత్రయం ఎందుకు అని.

జ్యోతీన్

మణి ఏడ్చిందని విన్న దగ్గిరనుంచి నాకు బోధపడ్డది: మణి మనస్సు వికసించడం ఆరంభించింది. ఒక్కమాటు పిల్చేయి పిన్నీ, మణిని. మధ్యాహ్నం వచ్చింది, అప్పుడు తీక్షణంగా ఎండ, పెద్దకాంతి చూసేసరికి—మణికాంతి, ఆహా, ఏమిటది—చూదామంటే ఒక నీడపొడ ఐనా లేదు. మణిని ఒక్కమాటు ఈ సంధ్య చీకటిలో చూడ నీయి—ఆ కాంతిలో, ఆ మణిలో, కన్నీరు కనబడుతుం దేమో చూదాం.

పిన్ని

ఆమె మనస్సులో ఉండే ప్రేమ నీదగ్గిర ముసుకు తీసి వేసి బయలు పడడానికి సిగ్గు పడుతూ ఉంది. అందుచేతనే, పాపం, ఆమె ఏడుపంతా నువ్వు చూడకుండా నీవెన కాతలనే.

జ్యోతీన్

సరే, ఉండనీ ఉండనీ, వెనకాతలనే ఉండనీ. గాని ఆ వెనకాతలి సంగతులు నాతో ఎప్పటికప్పుడు చెప్తూ ఉండు. ఎందుకంటే ఆముసుకు పోయె వరకూ బహుశా

నేను—లేదు పిన్నీ ఇవాళ సాయంకాలం మణితో మా
ట్లాడాలి, ఒక ముఖ్యమైన సంగతి.

పిన్ని

ఏమిటి ఆ ముఖ్యమైన మాట నాతో చెప్పుమా.

జ్యోతీన్

నామణి సౌధం తయారు అయింది కదా, ఆమాట
నానోటితో నేనే చెప్తాను. గృహప్రవేశం చేయడం మరి
నాపని కాదు. అదంతా మణిది, ఆమెకోసమేకదా ఈనా
సృష్టి, ఈగానం— ఇటుకలతో సృజించిన ఈనా వీణ
తాలూకు గానం

పిన్ని

ఆమాట ఆమెకు తెలియదు గాబోలు!

జ్యోతీన్

ఐనా నివేదించాలి కదా. హిమిని పాడమంటాను
అప్పుడు, ద్వారందగ్గిర, అవతల, కూర్చొని. ఏపాటో
తెలుసునా పిన్నీ, "మోర్ జీవనేక్ దాన్ కరో గ్రహన్
కరార్ పరం మూల్యే చరం మహీయాన్". వెళ్లు పిన్నీ
పిల్చేయి—పిన్నీ చూడు చూడు, నరహరిలాగున్నాడు.
నాకోసం కాబోలు వస్తున్నాడు, ఆ అడితి గుమాస్తా,

నారసంగతి మాట్లాడడానికి కాబోలు. ఇవాళ అతన్ని ఇక్కడికి రానియ్యకు పిన్నీ—వద్దు వద్దు, వద్దు, నేనేమీ వినను, ఇవాళ ఆమాటలేవీ వద్దు, ఎంతజరూరు వైనా సరే—తరవాత కనుక్కుంటాను అవసరమయితే. (పిన్ని వెళు.) చూడు హిమీ, ఇదిగో చూడు. (హిమి ప్ర) నీ కొక పాట వినిపిస్తాను, అది నువ్వు నేర్చుకోవాలి.

హిమి

వద్దు అన్నయ్యా, వద్దు, నువ్వుపాడ కూడదు. డాక్ట ర్ కూడదన్నాడు.

జాతీన్

మెల్లి మెల్లిగా నామనస్సులో నేనే పాడుకుంటాను. శాన్నాళ్లకు కినుబవుల్ పాడిన పాట జ్ఞాపకం వచ్చింది (జాతీన్ తనలోతాను పాడుకుంటాడు.)—పిన్ని చెప్పిన దానినిబట్టి పోల్చుకున్నాను, మీవదిన మనస్సు వికశించ డం ఆరంభించిందిసుమీ. గాని నేననే మాటలు నీకు బోధ పడవేమో, పోనీలే...ఇల్లంతా నువ్వు చూశావు కదూ!

హిమి

చాలా అద్భుతంగా ఉంది.

జ్యోతీన్

మీాదిగదిలో రాళ్లు పేర్చడానికని ఇచ్చాను ప్లాన్, ఏదీ అది?—ఇదిగో, ఈగదిలో కడ్డీలూ దూలాలూ ఏవీ కనబడకుండా ఒక కర్ర సరంబీ మంచిది వెయ్యమన్నాను, అది అయింది కదూ?

హిమి

అహా అయిపోయింది.

జ్యోతీన్

దాని మీాద ఏమేమి పని చేసిఉంది చెప్పుమీా.

హిమి

నాలుగు వేపులా వెడల్పుగా నీలి అంచు, మధ్య ఎర్రనిపద్మం, చుట్టూ తెల్లని హంసలు—నువ్వు చెప్పావు సమంగా అలాగే.

జ్యోతీన్

మరి, గోడలమీాద?

హిమి

గోడల మీాద కొంగల వరస; ముత్యపుచిప్పలు పేర్చినట్టుగా రంగు.

జ్యోతీన్

అడుగునో?

హిమి

అడుగున చుట్టూ శంఖాలు, మధ్య పెద్ద పద్మాసనం.

జ్యోతీన్

రెండువేపులా ద్వారం అవతల మార్బుల్‌తో చేసినవి జాడీల లాంటివి రెండేసి ఉన్నాయా?

హిమి

అహఁ, ఉన్నాయి. వాటిలో ఎలక్ట్రిక్ బుడ్లు ఉన్నాయికదా—ఏమి అందం!

జ్యోతీన్

తెలుసునా ఇంటికి పేరేమి పెడతామో?

హిమి

తెలుసును, మణి మందిరం.

జ్యోతీన్

ఆవాళ అఖిల్ పిన్ని దగ్గిరికి వచ్చాడు—ఏమిటన్నాడో ఇంటిమాట నువ్వేమన్నా విన్నావూ?

హిమి

అతనన్నాడూ—కలకత్తాలో ఇంత గొప్పఅందమైన మేడ ఎక్కడా లేదు అని.

జొతీన్

అదికాదు, అదికాదు. అఖిల్‌గాని ఈ ఇంటి—పోని లే అదెందుకు—ప్రయోజనం లేదు......మధ్యాహ్నం నాకిచ్చిన జావ మణి చేసినదని పిన్ని అన్నది. ఆహా! ఏమి టారుచి! నీకు అది—

హిమి

అదినాకు తెలియదు.

జొతీన్

ఛా, ఛా, చెల్లీ—ఇప్పటికైనా వదినతో నీకు సరి పడలేదు. నాకు అది—

హిమి

ఆడబిడ్డను కదా నేను, అందుచేతనే అయిఉం టుంది—

జొతీన్

శాస్త్రోక్తంగా దయా కోపం తెచ్చుకుంటున్నావు కాబోలు!

హిమి

ఔను అన్నయ్యా, అలాగే; ఆ హిందీపాటలో ఉన్నది చూడు "నదియా రహీ జాగి"

జ్యోతీన్

నువ్వు దానిని కొంచం మార్చావుకదూ? "నదియా రహీ రాగి"

హిమి

ఔనన్నయ్యా. గాని స్వరంమట్టుకు తప్పలేదు. (హిమి పాడుతుంది) "నదియా రహీ రాగి"—

జ్యోతీన్

గాని అపస్వరం చెయ్యకమ్మా చెల్లీ.

హిమి

ఎందుకు చేస్తాను? నీదగ్గరనే కదూ నేర్చుకున్నాను స్వరం.

జ్యోతీన్

ఒహ్ హో, ఏమిటిది! ఏదోపనిమీద వచ్చినట్టుగా ఇవాళ మనుష్యులు ఇంతమంది పోగైనారు! అదుగో నరేన్‌ఖా తాలూకు మనుష్యులు వాకిట దగ్గిరికి రావ

డం, ఇటూ అటూ పచారీ ఛెయ్యడం—హిమీ, నాకొక చిన్న పని చేసిపెట్టగలవూ? ఎలాగైనా తంటాలుపడి ఇప్పుడు బజారుధర—పోనీవద్దులే—ఆ తలుపు వేసేయి.

పక్కగది

పిన్ని

ఇదేమిటి మణీ! ఎక్కడకైనా వెళుతున్నావా ఏమిటి?

మణి

సీతారాంపూర్ వెళతాను.

పిన్ని

ఏమి టామాట, ఎవరితో వెళతావు?

మణి

అనాథ్ తీసుకు వెళ్తాడు.

పిన్ని

నాతల్లివి, వెళుదువుగానమ్మా, వెళుదువుగాని; ఇవాళకు మాత్రం ఆపుచెయ్యి తల్లీ.

మణి

టిక్కెట్టు కొని సీటు రిజర్వుకూడా చేయించేశాను. అమ్మ చార్జీలకు రూపాయిలు పంపించింది.

పిన్ని

కానీ, కొంచం నష్టం అయినంత మాత్రాన మనము మునిగిపోము—పోనీ, కాకపోతే, తెల్లవారుఝాము బండీలోనైనా వెళ్లు. ఈ రాత్రి—

మణి

మీ తిథీ వారాలతో నాకేమి పనిలేదు. ఇప్పుడువెళితే దోషం ఏమిటి కదా.

పిన్ని

నీతో ముఖ్యంగా మాట్లాడ వలసినది ఏదో ఉందట, జాతీన్ ఒక్కమారు నిన్ను రమ్మన్నాడు.

మణి

సరే ఐతే; ఇంకా పదిమినిట్లు టైముంది, ఈలోగా మాట్లాడి వస్తాను.

పిన్ని

నువ్వు వెళుతున్నావని చెప్పడానికి వల్లకాదు.

మణి

నే నామాట చెప్పను సరేగాని, ఆలశ్యం మాత్రం చెయ్యడానికి వీలులేదు. రేపే అన్నప్రాశన, ఇవాళ ప్రయాణం తప్పకూడదు.

పిన్ని

చేతులు పట్టుకొని చెప్పుకుంటున్నాను, ఈ ఒక్క రోజుమాత్రం నామాట మన్నించమ్మా. మనస్సు కొంచం కుదట పరుచుకొని జ్యోతీన్ దగ్గిర కాస్సేపు నెమ్మదిగా కూర్చొని రా తొందరపడకు.

మణి

ఐతే ఏమిటి చెయ్యమంటావు చెప్పుమీ. బండీ కూర్చేరుకదా. అనాథ్ వెళ్లాడు అప్పుడే. తిరిగి ఇప్పుడే వచ్చి నన్నుతీసుకు వెళ్తాడు. ఈలోపున ఆయనను చూసేసి వస్తాను.

పిన్ని

వద్దు అలాగైతే, నువ్వు వెళిపో. ఇలాగు వాడిదగ్గిరికి వెళ్లనివ్వను...ఓసీ అభాగ్యురాలా! బ్రతికే ఉన్నన్నాళ్లు ఈరోజు సంగతి నీకు నిత్యం జ్ఞాపకం వస్తూ ఉంటుందే !

మణి

అత్తయ్యా, నాకు అలాగు శాపం పెట్టవద్దు సుమీ, చెప్తున్నాను.

పిన్ని

ఓయి బాబు! అబ్బబ్బబ్బ, ఇంకెందుకు బ్రతికి ఉంటావే...నా దుఃఖానికి మరి అంతులేదు. ...మరి దీనిని ఆపి ఉంచలేకపోయినాను కదా.

(మణి వెళు.)

(శైల ప్ర.)

శైల

పిన్నీ, మీ కోడలి వ్యవహారం ఏమిటిది? ఏమి బాగుంది కదా! మొగుడు ఇలాంటి అవస్థలో ఉంటూ ఉంటే ఏమని పుట్టింటికి వెళిపోయింది.

పిన్ని

పిల్ల ఇంతగద్దు! చూడడానికి వెన్నతో తయారు చేసినట్టుగా కనబడుతుంది, గాని మనస్సంతా రాయే

శైల

ఆవిడిని చాలారోజులబట్టీ చూస్తున్నాను. గాని ఇంత పని చేయగలది అని అనుకోలేదు. ఇటు చూడు, పక్షా, పిల్లి, కోతి, నెమలీ—ఈ జంతువులన్నీ ఇన్ని పెంచుతూ ఉండే—అదేమీ బాగులేదు సుమీ. పోనీ పెంచిందమ్మా, వాటికేమైనా అయితే అంత గాభరాపడు

తుందే, మొగుడంటే మరి—అబ్బబ్బా! ఆవిడ సంగతి నాకేమీ బోధపడకుండాఉంది సుమా.

పిన్ని

మా జోతీన్‌కు ఆమె సంగతి పూర్తిగా, అంతా తెలుసును. ఏమి చేసిందనుకున్నావు ఒకనాడు: జోతీన్ తలనొప్పితో పడిఉంటే తన స్నేహితులను నలుగురిని పోగు చేసింది; ఇక ఏకసందడిగా నాటకానికి పరిగెత్తింది. ఊరుకోలేక అక్కడొక విసనకర్ర ఉంటే పట్టుకొని విసురుదామని జోతీన్‌దగ్గిరికి వెళ్లాను. వాడా విసనకర్ర నాచేతిలోనుంచి లాక్కొని పారేశాడు. ఓయి బాబు! మరి భరించలేను తల్లీ, ఆరోజుమాట తలచుకుంటే గుండె బద్దలైపోతుంది.

శైల

గాని పిన్నీ, చెప్తానువిను. ఈవిడలాగు రాయిలాంటి మనుస్సుండే ఆడవాళ్లు లేకపోతే ఎవరితరం మొగవాళ్ల మనస్సులు నొక్కిపెట్టి ఉంచడం, సందు దొరుకుతే ఎగిరిపారిపోదామని చూస్తూఉంటాయి కదూ! వీళ్లు మెత్తనైన కొలదీ వాళ్లు మరీసులభముగా తప్పించుకు పారిపోతారు.

పిన్ని

ఏమో ఎవరు చెప్పగలరు! అలాంటిదే కాబోలు మనుష్యుల స్వభావం. ముడి అన్నది ముడికానేకాదు, అందులో ఒకగట్టి వస్తువంటూ లేకపోతే. ఈవిషయంలో మొగవాళ్లు ఆడవాళ్లు అని తారతమ్యం లేదు. ప్రేమ అనే మాలలో ఉండేవి పారుజాత పువ్వులే ఐనా సూత్రం మాత్రం వజ్రం.

శైల

ఇంకా శైలు వెళిపోకుండా ఉంటే కొంచం బోధ పరిచి చూస్తాను.

(శైల నిష్క్ర.)

(పారుగావిడ ప్ర.)

పొరుగావిడ

ఆహా, ఇదేమిటమ్మా ఈచిత్రం, మీకోడలు పుట్టింటికి వెళిపోయిందట.

పిన్ని

ఐతే ఏమయింది? దానిగురించి మీఅందరికీ ఎందుకేమిటి ఈవిచారణ?

పొరుగావిడ

నిజమే, మాకెందుకుగాని, జోతీన్ అంటే అందరికీ ఎంతో అభిమానం. అందుచేతనే—

పిన్ని

ఆ, ఔను, అందుచేతనే జోతీన్‌కు ఎవరిమీద ప్రేమో ఆవిడిని మీరంతా కలిసి—

పొరుగావిడ

ఐతే, భేష్, చాలామంచిపనే చేసింది మణి. ఇంత మంచిపని చెయ్యగలిగిన వాళ్లు అతిస్వల్పం.

పిన్ని

భర్త ఇష్టప్రకారం నడుచుకొనే పెళ్లామే మంచి ఇల్లాలు అంటాము మామట్టుకు మణి అటువంటిది.

పొరుగావిడ

అది తెలుస్తూనే ఉంది

పిన్ని

మణి చిన్నపిల్ల. రోగిదగ్గిర ఎప్పుడూ పడిఉంటే చూసి. మరి భరించలేకపోయినాడు జోతీన్. ఆఖరికి డాక్టర్ గారి సలహామీద—సరే అదంతా ఎందు కిప్పుడు. మీ ఇష్టం

వచ్చినంత తిట్టుకుంటూ వీధివీధీ తిరగండిగాని మా జోతీన్ దగ్గిర బడబడలాడితే మాత్రం ఊర్కొనేది లేదు, జాగ్రత్త.

పొరుగావిడ

తెలిసిందమ్మా తెలిసింది. మణి ఎంత బాధపడుతూ పుట్టింటికి వెళ్ళిపోయిందో కొంచం బోధపడ్డది.

(డాక్టర్ ప్ర.)

డాక్టర్

ఏమిటి కథ! మీగడప దగ్గిరికి వచ్చాను, మీకోడలు ట్రంకుపెట్టె గుర్రపుబండీమీద పెట్టించి అన్నగారితో కూడా ఎక్కడికో వెళ్ళిపోతూఉంది. నన్ను చూసి కొంచం ఆగనైనా ఆగిందికాదు. జబ్బుమనిషి సంగతి కొంచం అడిగిందేమోఅంటే అదీలేదు. ఆవిడతో పోట్లాడి నట్టున్నారు (పిన్నిజబాబు లేదు) జోతీన్ స్థితి చూసి ఈ రెండు రోజులైనా మీకోడలి దగ్గిర అత్తగారి పెత్తనం కొంచం మీరు కట్టిపెట్టాలి.

పిన్ని

నా తరమా డాక్టర్? చచ్చినా పోదు నైజం. ఇద్దరూ ఒక్కఇంట్లో ఉండడం అంటూవస్తే దెబ్బలాట వచ్చే తీరుతుంది.

డాక్టర్

అలా చెప్పండి, అందుచేతనే కోడలు బండి తెప్పిం. చుకొని వెళిపోయింది. మీరు కొంచం వద్దని చెప్పవలసి ఉండెను. (పిన్ని జబాబు లేదు.) వెళిపోవడంచేతనే మీకు కొంచం ఊపిరితిరుగుతున్నట్టుగా ఉంది కాబోలు. గాని మీతో స్పష్టంగా చెప్తున్నాను వినండి: కోడలిని ఇం. ట్లోనుంచి వెళ్లగొట్టి ప్రతిక్షణం జ్యోతీన్కు ఆశాభంగం కలుగజేస్తున్నారు. అంటే, అతనికి కేవలం ప్రాణ భంగం కలుగజేస్తున్నారన్నమాట. మాకు అన్నిటి కంటే ముఖ్యంగా కావలసినది రోగిక్షేమం. అందుచేతనే ఇంతస్పష్టంగా మీతో చెప్పవలసివచ్చింది. లేకపోతే మీ అత్తాకోడళ్ల పోట్లాటతో జోక్యంకలుగజేసుకోడా నికి నాకుఉండే అధికారం ఎమిటి?

పిన్ని

తప్పు చేశానే అనుకొండి; దానివిషయమై ఇప్పుడు ఊరికే తర్కంచెయ్యడంవల్ల ఏమీ ప్రయోజనం లేదు. లాచారిపడి నాఅంతటనేను నాకోడలిని రమ్మనిరాయడం నాప్రాణం ఉండగా నేను చెయ్యను, నువ్వు తిట్టినా సరే ఇక ఏమిచేసినా సరే. గాని ఒక్కఉపకారం మట్టుకు నువ్వు చెయ్యగలవు.

డాక్టర్

ఏమిటి చెప్పండి ?

పిన్ని

మా జోతీన్ మామగారికి, సీతారాంపూర్ ఒక ఉత్తరం రాసిపెట్టు. అందులో జోతీన్ ప్రస్తుతపు స్థితి ఎలాగుందో అది రాయి. ఆయనసంగతి నాకు బాగా తెలుసును, ఆవుత్తరం అందీఅందడంతోనే కోడలిని తీసుకొని వస్తారని నాకు బాగా నమ్మకం.

డాక్టర్

సరే రాస్తాను. గాని ఆవిడ పుట్టింటికి వెళ్లిందన్న మాట జోతీన్ చెవిని మాత్రం ఏవిధంగానైనా పడకూడదు. చెప్తున్నాను : ఇది తెలిస్తే నామందు మరి ఏమీ పని చెయ్యదు ...అమ్మా హిమీ, ఇక్కడ కూర్చున్నావా. ఒక్కపని చేసిపెట్టు.అన్నయ్యకు ఏపాట ఇష్టమో ఆపాట కొంచం ఆద్వారం దగ్గిర కూర్చొని పాడమ్మా. మీవదిన మాట అడగడానికి అవకాశం ఇవ్వకుండా చూడాలి. విన్నావా అమ్మా?—ఇదేమిటిది ఏడుస్తున్నావు! ఛా,ఛా, ఇప్పుడా ఏడవడం! ఇప్పుడు పాడాలి—సీతో చెప్పానా, ఒక పుస్తకం రాస్తున్నాను, అందులో కనపరుస్తాను: సంగీ

తం తాలూకు వైబ్రేషన్‌కున్నూ రోగబీజాలచలనానికిన్నీ బద్ధవైరమని. నొబెల్ ప్రైజ్ కోసం ప్రయత్నం చేస్తున్నాను, తెలిసిందా, మరేమిటనుకున్నావు.

(హిమిపాట)

(అఖిల్ ప్ర.)

అఖిల్

ఎందుకు పిల్చావట కక్కీ ?

పిన్ని

నీకోసం కబురు పంపించమని నిన్నటినుంచీ జొతీన్ మాటిమాటికి అడుగుతున్నాడు. మరి వాడిని పట్టిఉంచలేకపోయినాను.

అఖిల్

అతని ఇంటి తనఖా వ్యవహారం గురించా ?

పిన్ని

ఆసంగతి వాడి మనస్సులో బాగా ఉంది, గాని దాని గురించి వాడేమి అనడూ, అడగడు. ఆసంగతి తనకు బాధపెట్టినప్పుడల్లా దానిని చెదరగొట్టేసుకొని సమాధానపరుచుకుంటున్నాడు. నువ్వు వాడిదగ్గిర ఆసంగతి ఎంత మాత్రం ఎత్తకుమా; వాడుకూడా ఎత్తడు లే.

అఖిల్

ఐతే మరి నాఅవసరం ఏమిటివచ్చింది ?

పిన్ని

వీలు రాయించడానికి.

అఖిల్

వీలా ! నిశ్చేష్టుడినిగా చేస్తున్నావే!

పిన్ని

తెలుసును నాకు, అదంతా అవసరం లేనిపని అని. గాని నీకాళ్లు పట్టుకు అడుక్కుంటాను, ఈమాట మట్టుకు ఉంచాలి: సంభవమైనా సరే అసంభవమైనా సరే, వాడు ఎవరెవరికి ఏదేది రాసేమంటాడో అదంతా వాడు చెప్పినట్టుగా రాసేయి—నవ్వవద్దు, వాడుచెప్పేదానికి అడ్డు చెప్పవద్దు. తరవాత వీలుగతి ఏమవుతుందో అది నాకు తెలుసును.

అఖిల్

నాకు మాత్రం తెలియదా ఏమిటి ? జార్జి చక్రవర్తి గారి రాజ్యమంతా జోతీన్ నా కిచ్చేసినట్టుగా కూడా నేనువీలు రాయించేయగలను.(Undue influence) అన్డ్యూ ఇన్‌ఫ్లూయన్స్ చేసి రాయించానని నామీంద చక్రవర్తి

దావా చెయ్యడు—ఆమాట నాకు బాగా తెలుసును. గాని కక్కీ, ఈ ఇంటిసంగతి చెప్పవలసిన రెండుమాటలూ నీతో చెప్పేస్తాను విను. నాపార్టీవాళ్లు మరి—

పిన్ని

అఖిల్, ఇకనైనా రెండు నిజమైన మాటలు అనుకుందామమ్మా; ఇంటా, బైటా అబద్ధాలు ఆడి ఆడి ఊపిరి తిరగక చచ్చిపోతున్నాను. నేను చెప్తానువిను, నీపార్టీ వాళ్లు నువ్వే. ఈరహస్యం మొదటినుంచీ నాకు తెలుసును.

అఖిల్

అదేమిటి ఆమాట కక్కీ!

పిన్ని

గాని దాచడం ఏమీ అవసరం లేదు. నువ్వు చేసినది మంచి పనే అంటాను. నాడబ్బుమీద అధికారం మీదేను. నాకు తెలుసును. అందుచేతనే మీరు ఎప్పుడూ దానిమీదనే కన్ను వేసి ఉంచారు.

అఖిల్

ఛి ఛీ! ఇలాంటి మాట—

పిన్ని

అందులో తప్పేమిటుంది చెప్పు. మీరూ నాపిల్లలలాగేకదా. మీకే అంతా ఇచ్చేదును. మేము ఇద్దరం అక్కచెల్లెళ్లం. గాని మానాన్న గారికి మా అక్కమీదకోపం వచ్చి, డబ్బంతా నాఒక్కర్తెకే ఇచ్చేశారు. ఆ కోపం చల్లారిపోక ముందే ఆయన పోయినారు. స్వర్గలోకంలో ఉన్నారు, ఇప్పుడాయనకు మరి కోపం ఏమీ లేదు. అందుచేతనే ఆ ఆస్తి అంతా ఆయన మనమల సౌఖ్యం కోసము ఇంత సునాయాసంగా ఖర్చు చేసేస్తున్నాను. లక్ష్మీకృప వల్ల మీకు డబ్బు లోటేమీ లేదు.

అఖిల్

దాని సంగతి నీతో ఏమైనా చెప్పానా ఏమిటి ఎప్పుడైనా?

పిన్ని

జ్ఞానం ఉంటే మాట లెందుకు? ఇంటినిషా పట్టుకుంది జాతీన్‌కు. ఆ నిషాలో ఎటువంటి సహించతరంకాని బాధ ఉందో నీలాంటి బుద్ధిమంతులు, లాయర్లకు, బోధపడదు. నేను ఆడదానిని, పైగా వాడి పిన్నిని; చూసి నాగుండె బద్దలైపోయింది; గాని అప్పు ఎక్కడ తేగలను? మరేదీ

దారికనబడక నీదగ్గిరికి వచ్చాను. నువ్వు ఒక దొంగపా
ట్టీని నిలబెట్టి—

(హిమి ప్ర.)

హిమి

పిన్నీ, ఎవరో ముసిలి బ్రాహ్మడు వచ్చాడు.

పిన్ని

బంగారు తల్లివి, ఒక్కమారు కూర్చోమని చెప్పమ్మా,
నేనిప్పుడే వస్తున్నాను.

(హిమి వెళు.)

అఖిల్

కక్కీ, మీ అక్కయ్యగారి అమ్మాయి, ఈమెకు, ఎంత
వయస్సుంటుంది?

పిన్ని

పదిహేడు మొన్ననే వెళ్లాయి. ఇంటర్ మీడియేట్
పరీక్షకు ఈసంవత్సరం వెళుతుంది.

అఖిల్

గాత్రం ఏమి మధురం! పైనుంచి విన్నాను ఆమెపాట.

పిన్ని

అన్నా చెల్లీ, వాళ్లిద్దరిదీ ఒకటే జాతి. అన్నకు ఇల్లూ
దీనికి పాట, రెండిటిదీ ఒకటే స్వరం.

అఖిల్

పెళ్లి సంబంధం—

పిన్ని

అబ్బెబ్బె, వద్దుసుమా! అన్నకు జబ్బు ఆరంభించినద గ్గిరనుంచీ ఆమాట ఎవరి నోటివెంటా రానివ్వదు. చదువూసంధ్యా అన్నీ కట్టిపెట్టి రాత్రింబగళ్లు ఇక్కడే పడి ఉంటుంది.

అఖిల్

గాని మంచి సంబంధం చూసి పెట్టగలను కక్కీ; తరవాత నాతో—

పిన్ని

నీపార్టీని చూసి పెట్టావే ఆలాగే కదూ!

అఖిల్

లేదు కక్కీ, హాశ్యం కాదు. ఆమెకు హార్మోనియం ఒకటి కొని పంపిద్దామనుకుంటున్నాను, మీరేమీ—

పిన్ని

ఏమీ తప్పు లేదుగాని దానికి హార్మోనియం ఇష్టంలేదు.

అఖిల్

పాటతో కలిపి వాయించడానికి?

పిన్ని

కలిపి ఏస్ రాజ్ వాయిస్తుంది.

అఖిల్

పోనీ, ఏస్ రాజే పంపిస్తాను ఐతే.

పిన్ని

దానికి ఉంది ఏస్ రాజ్.

అఖిల్

ఉండనీ, ఇంకొకటి ఉంటుంది. కూడపెట్టడమే కదూ ఆడవాళ్ల బుద్ధి అంటారు.

పిన్ని

సరే పంపించు ఏస్ రాజ్. గాని ఇక నేను చెప్పవలసినది కొంచం ఉంది, అదివిను. మాపుట్టింటివాళ్లు పెట్టిన సరుకులమ్మి ఇన్నాళ్లూ వడ్డీ చెల్లిస్తూ వచ్చాను. మధ్య మధ్య నీపార్టీ వాళ్లు మూడురోజులలో పూర్తిగా చెల్లించేయమని గట్టిగా రాస్తూ ఉండేవారు. చెల్లించక పోవడంచేత వడ్డీ జాస్తీ చేసేసేవారు. ఇలాగు చేసి చేసి నాదగ్గిర ఒకదమ్మిడీ ఐనా లేకుండా చేసేశారు. ఇలాగు కక్కిన సొమ్మంతా మరిదిగారి కొడుకు పెట్టెలోకి వెళిపోయింది. ఇదంతా చూసి ఆలోకంలో (ప్రేతలోకంలో) మామగారు సంతోషిస్తూ ఉంటారు. గాని మానాన్నా, జ్యోతీన్

తల్లీ— స్వర్గలోకంలో ఉన్నారే— వాళ్ళకన్నీరుగాని రాలిందా అంటే—

(హిమి ప్ర.)

హిమి

అన్నయ్య మాటిమాటికి నిన్ను పిలుస్తున్నాడు పిన్నీ. ఏక గాభరా పడుతున్నాడు. ఇక వదిన మాట అదే అడగడం—నాకు నోటివెంట మాట రాకుండా ఉంది, గొంతుక అడ్డు పడ్డట్టుగా ఉంది. (కళ్లనొత్తుకొని ఏడుస్తుంది)

పిన్ని

ఏడవకు తల్లీ, ఏడవకమ్మా; నేను వెళుతున్నా అన్నయ్య దగ్గిరికి.

అఖిల్

కక్కీ—, నేను చెయ్యగలిగినదేమైనా ఉంటే చెప్పు. లేక పోతే జాతీన్ దగ్గిరికి వెళ్లి—

పిన్ని

ఔను, జాతీన్ దగ్గిరికి వెళ్లు, ఆపీలు సంగతి చూడా లికధా.

జబ్బుగది

జ్యోతీన్

మణి రాలేదే! ఎంత ఆలశ్యం చేసింది!

పిన్ని

అదో క కథ. వెళ్ళి చూదును, నీకోసం పాలు మర గపెడదామని వెళ్ళింది. ఆపాలు, పొంగి పొయిలో పడి పోయినాయి. ఇక అదే ఏడుపు—గొప్పఇంటి పిల్ల, పాలు తాగడం తెలుసును గాని మరగ పెట్టడం నేర్చుకుందా ఏమిటి, ప్రాణం ఉండబట్టక నీకోసం ఏదో చేస్తూ ఉండడం గాని! నానా విధాల బోధపరిచి పరుపుమీద పడుకో పెట్టి వచ్చాను. కొంచం పడుకోనీయి.

జ్యోతీన్

పిన్నీ !

పిన్ని

ఏమిటి నాయనా ?

జ్యోతీన్

తెలుస్తూఉంది పిన్నీ...నా దినాలు ఆఖరై పోవచ్చాయి. గాని అందుకని నాకేమీ విచారం లేదు. నాకోసం విచారించకండి పిన్నీ.

పిన్ని

లేదు నాయనా, నావంతు ఏడుపు అయిపోయింది. బ్రతికి ఉండడం సుఖమూ, చచ్చిపోవడం దుఃఖమూ కాదని నాకు భగవంతుడు కొంచం నచ్చచెప్పాడు.

జ్యోతీన్

నాకు చావు మధురంగానే కనబడుతుంది. నాకు ఇవాళ అంతరిక్షాన్న—ఆ రేవు దగ్గిరనుంచి—సనాయి వినబడుతూఉంది. హిమీ! హిమి ఎక్కడ పిన్నీ? అదుగో, ఆ కిటికీ దగ్గిర నిలుచుంది.

హిమి

ఏమన్నయ్యా, ఏమిటి కావాలి ?

జ్యోతీన్

బంగారు తల్లివి, నా చెల్లమ్మవు! నువ్వు అలాగు దాగొని దాగొని ఏడవకమ్మా. నువ్వు ఏడుస్తూ ఉంటే నీ కన్నీటిచప్పుడు నాకు నాలోపునుంచి వినబడుతూఉన్నట్టు ఉంటుంది చెల్లీ...నీ చెయ్యి ఇలాగు ఇయ్యి అమ్మా, కొంచం చూడనీ. నావంట్లో ఇవాళ ఎంత కులాసాగా ఉందో తెలుసు! నా చెల్లమ్మా... ఏదీ ఆపాట పాడు చెల్లీ. "యది హా లో జాబార్ థున్"

(హిమిపాట)

పిన్ని

బుడ్డిలో వేడినీళ్లు పోసి తీసుకురా అమ్మా, పాదాల దగ్గిర పెట్టాలి.

(హిమి వెళు.)

జ్యోతీన్

బాధగా ఉంది పిన్నీ— గాని నువ్వనుకున్నంత బాధ లేదులే. బాధ మెల్లిగా నాదగ్గిరనుంచి వేరై పోతూ ఉంది. బాధ అనేది సామానునిండుగా వేసిన పడవ మోస్తరు. ఇది పెద్ద ఓడకు కట్టి ఉన్నట్టుగా బాధ మనజీవనానికి కట్టి ఉంటుంది. ఆకట్టు ఇవాళ తెగిపోయింది. నాకు అది కన బడుతూ ఉంది, గాని నన్ను అంటిమాత్రంలేదు... ఈ మూడురోజులూ రాత్రీ పగలూ కూడా మణిని చూడ నేలేదు.

పిన్ని

బాబూ, కొంచం దాలిమ్మరసం పుచ్చుకో అమ్మా. గొం తుక ఆర్చుకు పోతుంది.

జ్యోతీన్

నా వీలురాత నిన్న అయిపోయింది అదినీకు చూపిం చానా పిన్నీ? నాకు సరిగా జ్ఞాపకంరాకుండా ఉంది.

పిన్ని

నేను చూడడంఎందుకు జ్యోతీన్.

జ్యోతీన్

అమ్మ పోయేసరికి నాదగ్గిర ఏమీలేదు. నన్ను నీడబ్బు పెట్టి పెంచావు. నీచేతిమీద పెరిగిన వాడను నేను. అందుకనే నేనన్నాను—

పిన్ని

మళ్లా అదే మాటా! నాకు చిన్న ఇల్లూ మరేమో కొంచం రూపాయలూ ఉండేవి. తతిమ్మాదంతా నువ్వు స్వయంగా గడించినదే కదూ.

జ్యోతీన్

గాని ఈ ఇల్లు—

పిన్ని

ఇల్లు నాదెలాగవుతుంది ? ఎన్నింతలు పెద్దది చేశావు నువ్వు! నాది అందులో ఇప్పుడు వెతుకుదామన్నా కనబడదే !

జ్యోతీన్

మనస్సులో నువ్వంటే మణికి ఎంతో—

పిన్ని

ఆమాట నాకు తెలియదూ జ్యోతీన్? నువ్వుకొంచం నిద్రపో అమ్మా, ఇకను.

జ్యోతీన్

రాయడమైతే మణి పేరనే గాని, అంతా నీదేను. నిన్నెప్పుడూ మణి అనాదరం చెయ్యదు సుమా.

పిన్ని

దాని గురించి అంత ఆలోచన ఎందుకు బాబు?

జ్యోతీన్

నీ దీవనవల్లనే కదా నాకు ఇదంతాను. నావీలు చూసి నువ్వెప్పుడూ ఏమీ అనుకోకుమీ. నాకు—

పిన్ని

అదేమిటామాట జ్యోతీన్. నీ ఆస్తి నువ్వు మణికి ఇచ్చావని నేనేమైనా అనుకుంటాను! అంతపాడు బుద్ధా నాది!

జ్యోతీన్

గాని నేను నీకే—

పిన్ని

చూడు జ్యోతీన్, ఈమాటు నాకు నిజంగా కోపం

వస్తుంది. నువ్వు వెళిపోతావు, రూపాయలతోనా నన్ను మరిపించాలని చూస్తున్నావు ?

జోతీన్

పిన్నీ, రూపాయలకంటే విలువగల వస్తువు ఏదీ నీకు—

పిన్ని

ఇచ్చావు జోతీన్, అనేకంగా ఇచ్చావు. నువ్వు రాక ముందు నా ఇంట్లో ఉత్త సూన్యమే. నువ్వు వచ్చి అదంతా నింపావు. ఇది నాకు ఎన్నో జన్మాలకు తగిన భాగ్యం. ఇన్నాళ్లూ మనస్సార అనుభవించాను ఇక నాకుముట్టవలసినది ఏమీ లేక పోతే ఎవ్వరినీ నిందించను. రాసేయి, ఇల్లూ వాకలీ, ఇంట్లోఉండే సామానూ, గుఱ్ఱమూ బండీ భూమీ పుట్రా—ఏమేమి ఉన్నాయో అన్నీ రాసేయి మణిపేర. ఈ బెడదంతా మరి నేను పడలేనమ్మా.

జోతీన్

నీకు భోగం అంటే ఇష్టంలేదు. గాని మణి చిన్నది కదా, అందుచేత—

పిన్ని

ఆస్తిపాస్తి కావాలంటే ఇచ్చేయిగాని, భోగంమాట మట్టుకు—

జ్యోతీన్

ఎందుకు అనుభవించ కూడదు పిన్నీ?

పిన్ని

లేదురా బాబూ, లేదు; అనుభవించలేదు, నేను చెప్తున్నాను విను; అనభవించలేదు, నోరు అరుచి అయిపోతుంది, గొంతుక ఆర్చుకు పోతుంది. ఏదన్నా ఇక ఇష్టముండదు.

జ్యోతీన్

(మాట్లాడకుండా ఊరుకొని, నిట్టూర్పు విడిచి) ఇవ్వదగినదేదీ——

పిన్ని

ఇచ్చినదేమి తక్కువా? ఇల్లనీ వాకలనీ డబ్బనీపేరు పెట్టి ఇచ్చినదాని విలువ ఎప్పటికైనా తెలియదంటావా ఏమిటి ?

జ్యోతీన్

నిన్న మణి వచ్చిందీ! నాకు జ్ఞాపకం రాకుండా ఉంది.

పిన్ని

ఆ, వచ్చింది. నువ్వు పడుకున్నావు, వచ్చిచాలాసేపు నీ తలదగ్గిర కూర్చొని కూర్చొని——

జూతీన్

ఏమి వింత! నేను సరిగా ఆవేళప్పుడే కలగన్నాను సుమా! మణి గదిలోకి రావాలనుకుంటూ ఉన్నట్టూ, తలుపు కొంచం తెరిచి ఉన్నట్టూ, ఊరికే తోస్తూ ఉంటే తలుపు మరి అంతకంటే విడనట్టూ—గాని మీరు మరీ అనవసరంగా గొడవచేస్తున్నారు పిన్నీ. మణిని ఒక్క మారు రానిద్దురూ, సంధ్యకాలపు కాంతి లాగు ఎలాగుకదా నాకు—

పిన్ని

నీ కాళ్ల మీద ఉన్న శాలువ కొంచం సరదనియ్యి బాబూ, పాదాలు చల్లగా ఉన్నాయి.

జూతీన్

వద్దుపిన్నీ, వంటిమీద ఏమి వేసినా చికాకుగా ఉంటుంది.

పిన్ని

నీకు తెలుసునూ జూతీన్, ఇది మణి అల్లిన శాలువ! ఇన్నాళ్లూ రోజూ రాత్రి మేలుకొని తయారు చేసింది. నిన్న నేపూర్తి అయింది. (జూతీన్ శాలువు మీద చెయ్యి వేసి చేతితో తడిమి చూస్తాడు. పిన్ని దానిని పాదాల మీదికి లాగుతుంది.)

జ్యోతీన్

హిమి చేసిందని అను కుంటున్నాను నేను. మణికి వ్రాలుపని అంటే ఇష్టంలేదే, మణి అల్ల గలదూ!

పిన్ని

ప్రేమ అనే ప్రవాహంలో ఉన్నప్పుడు ఏదైనా నేర్చు కుంటారు ఆడవాళ్లు. హిమిఏమో మణికి చేసిచూపించిం దిలే. గాని దానినిండా అల్లిక తప్పులు చాలా ఉన్నాయి.

జ్యోతీన్

హిమీ, విసనకర్ర అక్కడ పడేయి అమ్మా. దా, వచ్చి నాదగ్గిర కూర్చో. ఇవాళే పంచాంగం చూసి నీతో చెప్పే స్తాను, గృహప్రవేశముహూర్తం ఎప్పుడో.

హిమి

ఊరుకో అన్నయ్యా, ఆమాటలన్నీ ఇప్పుడు——

జ్యోతీన్

నేను దగ్గర ఉండనుకదా—— ఆమాట జ్ఞాపకంఉంచు కొని—— లేదులేదు చెల్లీ, నేను ఉంటాను, ఆరోజున ఈ ఇంట్లో గాలిలో గాలినై ఉంటాను. మీరు నన్ను పో ల్చుకుంటారు. నువ్వు పాడవలసిన పాట నిర్ణయించి ఉం చేశాను- ఆ "అగ్నిశిఖా" పాట. ఏదీ ఒక్కమాటు పాడు వింటాను.

(హిమిపాట)

పాటలో ఉత్సవంసంగతి ఉన్నది, అదేదో తెలుసునా హిమీ.

హిమి

నాకు తెలియదు.

జ్యోతీన్

పోనీ ఊహించి చెప్పుమీ చూదాము.

హిమి

నేను ఊహించ లేను.

జ్యోతీన్

నేను చెప్పనా నేదా? నీపెళ్లి అవుతుందీ, ఆ రోజున తెల్లవారుఝాము మొదలుపెట్టి—

హిమి

పోనీ అన్నయ్యా మరి—

జ్యోతీన్

ఆపాట నాకిప్పుడు వినబడుతూ ఉన్నట్టుగా ఉంది, భైరవి మీాదను ఆపిల్లంగోరు పాట—నీపెళ్లి ఖర్చుల కోసమని.

హిమి

నేను వెళిపోతా నన్నయ్యా అలాగై తేను.

జ్యోతీన్

పోనీ పోనీ, లేదులే చెల్లీ, కూర్చో కూర్చో. గృహప్రవేశంనాడు నాకు బదులుగా నువ్వు అంతా బందోబస్తు చెయ్యాలి సుమీ! జ్ఞాపకంఉంచుకో— తెల్ల తామర పువ్వులు ఎన్ని దొరుకుతాయో అన్నీ తెప్పించాలి. పీట మీద నా బనారసు ఖండువా, పెళ్లిలో ఇచ్చినది—

(శంభు ప్రవేశం)

శంభు

డాక్టర్ బాబుగారు అడుగుతున్నారు, ఇవాళ రాత్రి ఆయనగాని ఉండాలా అని.

పిన్ని

ఆహా, ఉండాలి.

అఖిల్

ఎన్నాళ్లబట్టో మీరు రాత్రీ పగలూ ఎడతెరిపిలేకుండా, పాపం, సేవచేస్తున్నారు, మీకు కొంచం రెస్ట్ (విశ్రాంతి) ఇద్దామని వచ్చాను. రోగిసేవ నేనుకూడా కొంచం కొంచం—

హేమ

అది మాత్రం వీలులేదు సుమండీ— కాక, నేను పని వల్ల విస్తారంఏమీ అలిసిపోలేదు.

అఖిల్

ఐతే నన్ను మీతో కలిసి కొంచంకొంచం చెయ్యనివ్వండి.

హేమ

ఈ పనులన్నీ—

అఖిల్

ఔను, తెలుసును నాకు, ప్లీడరీ కంటే చాలాకష్టం.

హేమ

అది నేననడం లేదు.

అఖిల్

గాని ఆమాట మట్టుకు నిజమే. నన్నుగాని బార్లీ కాచమంటే ఇంటికి నిప్పంటించేస్తాను.

హేమ

ఏమిటి మీరనేమాట!

అఖిల్

నిజమే, హాస్యం కాదు. ఇళ్లకు నిప్పుముట్టించడం నేను రోజూ చేసే పనే, తెలియలేదు! మీరు ఇక్కడ పథ్యం తయారు చేస్తున్నారు—నేను చేసేదేమో రోగికి పథ్యం కాదు సరేకదా, బాగున్నవాళ్లకుకూడా అజీర్ణం కలుగ జేసేది—చూస్తూఉండడం లేదూ! మీరు కొంచం కూర్చోండి, మీతో మాట్లాడాలి.

హేమి

ఇప్పుడు కబుర్లూ కథలూ చెప్పి మోస్తరు—

అఖిల్

అయ్యోరామా, కథలు చెప్పగలిగితే ప్లీడర్ పని కట్టి పెట్టి రెండో బంకిమ్‌చాటర్జీ అయిపోయి ఉందును. నవ్వ తారేమి, మేమురోజూ అనేకంగా కల్పిస్తూ ఉండాలి, అదేమీ సరదాగా ఉండదు నాకు. కథలు బాగా కల్పించ గలిగితే ఈ వృత్తి ఎందుకు! మీరు కథలు రాయడం ప్రారంభించినట్టుంది.

హేమి

లేదు.

అఖిల్

నాటకాలు?

హిమి

లేదు, నాకు అవేవీ రావు.

అఖిల్

అది ఎలాగు చెప్పగలరు?

హిమి

భాషాజ్ఞానం చాలదు. మాటలు తట్టవు.

అఖిల్

నాటకాలు తయారుచెయ్యడానికి భాష అవసరం లేదు, పుస్తకాలేవీ కూడా అక్కరలేదు—లేక మీ నాటకం అప్పుడే ఆరంభం అయిందా!—ఎవరు చెప్ప గలరు నిశ్చయంగా!

హిమి

నేను వెళ్తాను, పిన్నిని పిల్చేస్తాను.

అఖిల్

లేదు అవసరంలేదు. ఈ కబుర్లు కట్టి పెట్టేస్తాను లెండి. పనికివచ్చిన విషయమైన మాటలాడదాము. జ్యోతీన్‌తో

నేను చెపుదామని అనుకున్నాను గాని అతని వంట్లో ఇలా గుంటున్నప్పుడు——

హిమి

అతని వ_ర్తకం సంబంధం మాటలు నేనేమైనా విన్నా నేమో అని ప్రతిక్షణం అడుగుతున్నాడు. మీరుగాని——

అఖిల్

నాకు తెలుసును, అతని వ_ర్తకమంతా మట్టిలో కలిసి పోయింది.

హిమి

మీ కాళ్ల మీద పడతాను, ఈసంగతి మాత్రం అన్న య్యకు తెలియనియ్యకండి. ఏదికానివ్వండి గాని ఇల్లు మాత్రం——

అఖిల్

జ్యోతీన్ ఇంటిమాట ఎత్తుతూ ఉంటాడా ఏమిటి?

హిమి

ఎప్పుడూ ఒకటే మాట అంటూ ఉంటాడు "ఒకనాడు ఎంతో గొప్పగా గృహప్రవేశం అవుతుందీ, నా ప్రయత్న మంతా——"

అఖిల్

గృహప్రవేశం ప్రయత్నం అవుతూనే ఉంది—

హేమ

మీ కెలాగు తెలిసింది?

అఖిల్

మా ఆఫీసులోనుంచే అంతా జరుగుతూఉంది. అప్పులవాళ్లంతా వేషభూషణాలతో సిద్ధం అవుతూ ఉన్నారు.

హేమ

చూడండి అఖిల్ బాబుగారు, ఇది హాస్యం చెయ్య వలసిన విషయం కాదు.

అఖిల్

అది నాకు తెలియదూ? మీదగ్గిర దాచి ఏమి ప్ర యోజనం? ఈ ఇల్లు రుణం కింద—

హేమ

వద్దువద్దు, అలాగు ఎంతమాత్రం కానివ్వకూడదు. అఖిల్ బాబుగారూ, దయఉంచి మీ రెలాగైనా—

అఖిల్

గాని ఎందుకు మీరింత యోచన చేస్తున్నారు, మీకు అంతా తెలియనే తెలుసును. మీఅన్నయ్యే మో మరిచాలారోజులు——

హేమి

తెలుసును తెలుసును, మరి అన్నయ్య ఉండడు. అదైనా భరించవచ్చునుగాని అతని ఇల్లు, ఇది, కూడా పోతే గుండె బద్దలై చచ్చిపోతాను. ఇది అతని ప్రాణం కంటే——

అఖిల్

చూడండి, క్లాసులో మీకు సాహిత్యంలోనూ, లెఖ్ఖలలోనూ, లాజిక్‌లోనూ నిండు మార్కులు వస్తూ ఉంటాయిగాని ప్రపంచజ్ఞానంలో మాత్రం మీరు థర్డ్ క్లాస్‌లోనైనా పాస్ కాలేరు. ప్రపంచవ్యవహారాలలో హృదయమంటూ ఏదీ ఉండదు. హృదయ ధర్మాలు——

హేమి

అదంతా నాకు తెలియదు, మీకాళ్లమీద పడ

తాను. ఈ ఇల్లు మీరెలాగైనా కాపాడండి. మీ ఆఫీస్ వాళ్ళ—

అఖిల్

అలాగైతే అప్పువాళ్ళకు భజంత్రీమేళం వేషం వేయించి సనాయి చేతిలో పెట్టాలి. లా కాలేజీలో లా తాలూకు అధ్యాయం అంతా నేర్చుకున్నానుగాని లయ మాత్రం ఏమీ ప్రాక్టీస్ కాలేదు. అది బహుశా మీదగ్గిరనుంచి—

(పిన్ని ప్ర.)

పిన్ని

ఏమిటి అఖిల్ ఇదంతా? హేమి ఏడుస్తూఉంది ఎందుకు?

అఖిల్

గృహప్రవేశం ప్లానులో ఒకచిన్న మెలి ఉంది, అందుకని—

పిన్ని

ఐతే ఆసంగతులన్నీ దానితో ఎందుకు?

అఖిల్

వాళ్ళన్నయ్య గృహప్రవేశం భారమంతా ఆమె

మీాదపెట్టాడట. అందులో ఏ విధమైన లోపం రాకుండా ఉండాలని అందరినీ విడిచిపెట్టి నన్ను పట్టుకున్నారు. మీారందరూ ఇష్టపడితే ఈ గృహప్రవేశకార్యంలో నేను కూడా నడ్డికట్టుకు దిగగలను. నేననేది తెలిసిందా కక్కీ?

పిన్ని

తెలిసింది, నడ్డి కట్టడం మాత్రమే కాదు, కట్టు మరిం తగట్టిగా కట్టాలని నీ ఉద్దేశం. సరేలే, ఆ మాటలన్నిటి కీ వేళకాదు ఇది. నువ్వు జ్యోతీన్‌కు ధైర్యం చెప్పిరావాలి, ఏమైనా సరే నీ ఇంటి మీాద ఎవరూ చెయ్యైనా వెయ్యలేరు అని

అఖిల్

ఓ, తప్పకుండా; నారఖరీదు ఎక్కిందని కూడా చప్తాను ఇకనామెను కొంచం కళ్లు తుడుచుకోమని చెప్పండి

(డాక్టర్ ప్ర)

డాక్టర్

ఇదుగో ప్లీడరుగారా! ఐతే అయినట్టే.

అఖిల్

చూడండి, శని గొప్పా కలి గొప్పా అని వాదన చెయ్యడం ఏమిప్రయోజనం? మన బంగాళాదేశంలో ఏ

నలుగురో మీచేతులు తప్పించుకొని బ్రతికి వస్తారు, ఆనలుగురి సామాన్యసంసారుల సారమేకదూ మేము ఎంతపిల్చినాను.

డాక్టర్

ఆ పిల్చడానికి ఇక్కడ మరేమి వ్యవధి లేదు. ఇప్పుడే గదిలోకి వెళ్లి చూసి వస్తున్నాను.

అఖిల్

నన్ను జడిపించకండి డాక్టర్ గారు చావుతో మీ పని సరి గాని మా పని అంతవరకూ లోలోపున మెల్లి మెల్లిగా తయారవుతూ, ప్రారంభంఏమో తరవాతనే అవుతుంది. పోనివ్వండి, ఆ మాటలన్నీ ఎందుకు?

ఒక్కమాట కక్కీ——గృహప్రవేశ భారమంతా నేను భరించగలను, పైగా ఈమాత్రం ఆమాత్రం కూడా ఏదైనా భరించగలను——బైటగదిలో కూర్చుంటాను అవసరముంటే కబురుపంపించు.

(అఖిల్ వెళ.)

డాక్టర్

కోడలు ఇదివరకు గా లేదు. మీరైనా చాలాసేపయింది ఆ గదిలోకి వెళ్లి.

పిన్ని

మణి మాట అడిగితే ఏమీ జవాబు చెప్పడానికీ, తోచకుండా ఉంది. కల్పించి కూడా ఇకమరి చెప్పలేను, నామీద నాకే అసహ్యం పుడుతూ ఉంది. వాడు కొంచం నిద్ర పోనిచ్చి గదిలోకి వెళ్లాను.

డాక్టర్

నేను పై గదిలోఉంటాను ఒక ఘంటో ఎంతో అయిన తరవాత ఎలాగున్నదో కొంచం కబురు పంపించండి. ఈలోపున ప్లీడరుగారు లోపుకు రాకుండా పట్టి ఉంచాలి. అతనిని చూస్తే మంచివాళ్లకే ప్రాణాలు ఎగిరి పోతాయి.

---

# రెండో అంకం



రోగిగదిలో ద్వారం దగ్గర శంభు

పౌరుగావిడ ప్రవేశం

పొరుగావిడ

ఇదిగో శంభు!

శంభు

ఔనమ్మా.

పొరుగావిడ

ఒక్కమాటు జోతీన్‌ని చూసి వెళ్దామని. పిన్ని లేదు ఇప్పుడు, అలాంటప్పుడే—

శంభు

ఏమిటి చేస్తావమ్మా వెళ్లి?

పొరుగావిడ

నాటోరా మహారాజుగారి ఇలాకాలో ఒకపని ఖాళీ వచ్చిందట. మా కుర్రవాడి కోసం జోతీన్‌చేత ఒక ఉత్తరం రాయించి—

శంభు

అది మట్టుకు వీలులేదమ్మా, ఏమైన సరే; పిన్నికి తెలిస్తే మరి బ్రతక నివ్వదు.

పొరుగావిడ

ఆవిడికి ఎలాగు తెలుస్తుంది? గభుక్కున అయిదు మినిట్లలో—

శంభు

క్షమించమ్మా, ఏమైనా సరే అది మట్టుకు వీలులేదు.

పొరుగావిడ

వీలులేదేం! మా గాలి తగిలితే వాళ్ల అక్కకొడుకు మరి బ్రతకడని అనుకుంటుంది. అవతల తన సంగతి మరి ఆలోచించి చూసుకోదు. మొగుణ్ణి తినేసింది, ఒక్కకూతురుఉంటే ఆకూతురూ అయిపోయింది, తల్లీ తండ్రీ ఎవరినీ ఉంచింది కాదు, ఇక మిగిలిన వాడు ఈ జొతీన్ ఒక్కడే;-ఈమాటు అతనిని కూడా పరిష్కారం చేసేస్తుంది. చేసి మరీ తను సెలవు తీసుకుంటుంది. అంతవరకు ఆవిడికి చావు లేదు. నేను చెప్తున్నాను చూడు శంభు— పిన్నిచేతిలో జొతీన్ ఎప్పుడు పడ్డాడో అప్పుడే అతని పని సరి.

శంభు

అదుగో పిన్నిమాట వినబడుతూ ఉంది. ఇక నువ్వు వెళిపోఅమ్మా

పౌరు గావిడ

భయ పడకు వెళిపోతున్నాను లే

(పౌరుగావిడ వెళ.)

జ్యోతీన్ గది

శంభు ప్ర.

జ్యోతీన్

(అడుగుల చప్పుడు విని తుళుక్కుపడి) మణీ!

శంభు

నౌకరిని బాబూ, నేనూ, శంభును. నన్ను పిల్చారా.

జ్యోతీన్

ఒక్కమారు కోడలమ్మ గారిని పిల్చేయి.

శంభు

ఎవరిని ?

జ్యోతీన్

కోడలమ్మ, మణిని,

శంభు

కోడలమ్మ ఇంకా తిరిగి రాలేదే!

జ్యోతీన్

ఎక్కడికి వెళ్ళింది ?

శంభు

సీతారాంపూర్.

జ్యోతీన్

ఇవాళ వెళ్ళిందా?

శంభు

వెళ్ళి ఇవాళకు మూడు రోజులయింది.

జ్యోతీన్

నువ్వు ఎవరవు? నాకు సరిగా కనబడుతూ ఉందా లేదా?

శంభు

నేను శంభును, బాబు.

జ్యోతీన్

సమంగా చెప్పుమీ, నేనేమీ భ్రమపడలేదు కదా?

శంభు

లేదు బాబు.

జ్యోతీన్

ఏ గదిలో ఉన్నాను నేను? ఇదేపూరు, సీతారాం పూరా?

శంభు

కాదు, ఇది కలకత్తాలో మీ పడకగది.

జ్యోతీన్

అబద్ధం కాదూ, ఇదంతా నిజమే?

శంభు

పిన్నిని పిల్చేస్తాను

(శంభు వెళ.)

పిన్ని ప్ర.

జ్యోతీన్

నాకు ఇంకా జీవం ఉందో లేదో ఎలాగు పోల్చుకోవడం పిన్నీ! అంతా తల్లకిందులు అయిపోయినట్టుఉంది?

పిన్ని

అదేమిటి! అలాగు అనకమ్మా జ్యోతీన్ !

జ్యోతీన్

నువ్వు పిన్నివేనా?

పిన్ని

కాక నా రెవరిని జ్యోతీన్?

జ్యోతీన్

హిమిని పిల్చేయిమిరా పిన్నీ. వచ్చి నాదగ్గిర కూర్చో మను, మరెక్కడికీ వెళ్లకుండా నాదగ్గిరే కూర్చోవాలి.

పిన్ని

రా అమ్మా హిమీ, వచ్చి ఇక్కడ కూర్చో అమ్మా.

జ్యోతీన్

ఆ పిల్లంగోరు ఆపేయమను. అదేటిమి గృహప్రవేశం కోసం తెప్పించారా ఏమిటి! మరి దాని అవసరం లేదు.

పిన్ని

పక్కఇంట్లో పెళ్లి, అది అక్కడ వాయిస్తూఉన్న అల్గోజా.

జ్యోతీన్

పెళ్లి అల్గోజావా? అంత ఏడుపెందుకు అందులో? బెహాగ్ లాగుందే! నా కలమాట నీతో చెప్పానా పిన్నీ?

పిన్ని

ఏ కల?

జోతీన్

మణి నా గదిలోకి రావాలని తలుపు తోస్తూఉంది, తలుపు అంత పిసరు తెరవబడ్డది, ఎంత తంటాలుపడ్డా అంతకంటే మరి తెరవలేదు. బయిట నిలవబడి మణి చూస్తూ ఉంది. ఏవిధంగానైనా లోపలికి రాలేక పోయింది. ఎంతో పిల్చాను, గాని ఆమెకు మరి గృహప్రవేశంకాలేదు——కాలేదు——కాలేదు——పిన్నీ కాలేదు. (పిన్ని జవాబు లేదు.) తెలిసింది పిన్నీ, తెలిసింది. నేను దివాలా, పూర్తిగా దివాలా, అన్ని విధాలా దివాలా. ఇల్లుకూడా——పోయింది, అమ్మకం అయిపోయింది. నామనస్సును మాత్రం మాయలో పెట్టుకున్నారు.

పిన్ని

లేదు జోతీన్, లేదు. ఒట్టు పెట్టుకు చెప్తున్నాను—— నీ ఇల్లు ఉంది, పోలేదు. అఖిల్ వచ్చిఉన్నాడు, కావలస్తే పిలుస్తాను——

జ్యోతీన్

ఇల్లుఉందీ ఐతే? వాళ్లు ఇంకా ఆగగలరూ? నాలాగే అది కూడా మాయ కాదూ? సంవత్సరాలతరబడి శాశ్వతంగా ఆ ఇల్లు అలాగు తెరిచి ఉండనీయి——ఏమి పిన్నీ!

పిన్ని

ఉంటుంది తప్పకుండా జ్యోతీన్! నీ ప్రేమతో నిండి ఉంటుంది ఎప్పుడూ!

జ్యోతీన్

చెల్లీ, హేమీ, నువ్వు ఉంటావు మన ఇంట్లో. ఎప్పుడో ఆరోజు వచ్చినప్పుడు గృహప్రవేశం చేయించు చెల్లమ్మా ఏలోకంలో ఉన్నా నాకు తెలుస్తుంది ఆరోజు——హేమీ, హేమీ!

హేమి

ఏమి అన్నయ్యా!

జ్యోతీన్

నీదే భారమంతా చెల్లమ్మా. జ్ఞాపకం ఉందా అమ్మా ఏపాట పాడాలో?

హిమి

జ్ఞాపకం ఉంది—"అగ్నిశిఖా ఏషా ఏషా"

జ్యోతీన్

చెల్లమ్మా, బంగారు తల్లివి, ఎవరిమీదా కోపం ఉంచుకోకు, అందరినీ క్షమించుఅమ్మా. నా మాట ఎప్పుడు జ్ఞాపకంవచ్చినా ఏమనుకుంటావో తెలుసునా—"అన్నయ్యకు నేనంటె ఎంతో ముద్దు, ఎంతో ప్రేమ, శాశ్వతకాలమున్నా అన్నయ్యకు నామీద ప్రేమ—ఇప్పటికీ ఉంది ఆ ప్రేమ" అని. పిన్నీ, తెలుసునా— ఈ ఇంట్లోనే మన హిమిపెళ్లి అవుతుంది—మనపాత అంగణంలో. అమ్మ పెళ్లిఅయిందీ— ఆ అంగణంలో, మొదటినుంచి ఉండే ఆ అంగణం—దానిమీద నేను చెయ్యైనా వెయ్య లేదు.

పిన్ని

అలాగే చేస్తాము నాయనా.

జ్యోతీన్

పిన్నీ, నువ్వు వచ్చేజన్మంలో నా కూతురువై పుడతావు. నిన్ను నాకడుపులో పెట్టుకు పెంచుతాను, పెద్దదానిని చేస్తాను.

పిన్ని

ఏమిటి నువ్వనేది జ్యోతీన్, మళ్లా ఆడదానినయే పుట్టాలనా? నీకొడుకునై నీఒళ్లో పెరుగుతాను—కావాలంటే ఆ కోరిక కోరు జ్యోతీన్.

జ్యోతీన్

అబ్బే కాదు. పిల్లడవు కావద్దు పిన్నీ, ఛాఛా! చిన్నప్పుడుండే దానవు అలాగు అపురూపమైన అందంతో నాఇంటికి పిల్లవై వస్తావు—నిన్ను నాచేతులతో నేనే--ముస్తాబు చేస్తాను.

పిన్ని

మరి అలాగు మాట్లాడుతూ ఉండకమ్మా. కొంచం నిద్రపో.

జ్యోతీన్

నీకు పేరేమి పెడతానో తెలుసునా—"లక్ష్మీరాణి".

పిన్ని

అది ఈకాలపు పేరు కాదే!

జ్యోతీన్

కాదు, ఈకాలపు పేరు కాదు. నీది ఒక కాలంకాదు, అన్ని కాలాలున్నూ—అనాదిగా ఉన్నావు నువ్వు. అమృతంతో నిండి ఉన్న నీ పూర్వపు ఆకారంతో నా ఇంటికి వత్తువుగాని—

పిన్ని

నీ ఇంట ఆడబిడ్డనై పుట్టి ఆడబిడ్డ దుఃఖం కలిగించడం మరి నావల్ల కాదు సుమా!

జ్యోతీన్

నా మనస్సు బలంలేనిదని అనుకుంటున్నావుకదూ పిన్నీ? దుఃఖం నా దగ్గిరికి రాకుండా నన్ను కాపాడాలని చూస్తున్నావూ!

పిన్ని

నాది ఆడవాళ్ల మనస్సు, బలహీనం. అందుచేత నీదగ్గిరికి ఏ దుఃఖమూ రాకుండా ఉండాలని అతి భయంతో ఇన్నాళ్లూ మహా ప్రయత్నంచేశాను, కాని నాచేత ఏమి అవుతుంది! ఏమీ చెయ్యలేక పోయినాను ఆఖరికి!

జ్యోతీన్

పిన్నీ, ఒక్కమాట మట్టుకు అతిగర్వంతో చెప్పగలను. నాకు దొరకని దానిని దేనినీ బలవంతాన్న సంపాదించుదామని ప్రయత్నం చెయ్యలేదు. యావజ్జీవం చేతులుజోడించుకొని కనిపెట్టుకొనిఉన్నాను. మిథ్య అక్కరలేదు గనుకనే ఇన్నాళ్లు ఓర్చి ఉన్నాను. ఇక బహుశా సత్యానికి నామీద దయ వస్తుంది—అదెవరు పిన్నీ? ఎవరది?

పిన్ని

ఏదీ జ్యోతీన్? ఎవరూ లేరే!

జ్యోతీన్

ఒక్కమారు ఆ గదిలో చూసిరా పిన్నీ, నాకేమో—

పిన్ని

లేదు నాయనా, ఎవరూ కనబడడం లేదు.

జ్యోతీన్

నాకు మట్టుకు స్పష్టంగా చూసినట్టుగా—

పిన్ని

ఏమి లేదమ్మా జ్యోతీన్.

(డాక్టర్ ప్ర.)

జ్యోతీన్

అదెవరది? ఎక్కడనుంచి వచ్చావు, నాతో ఏమైనా మాట్లాడడానికా ఏమిటి?

పిన్ని

ఆయన డాక్టర్.

డాక్టర్

మీరు ఆయన దగ్గిర ఉండకండి, యేక మాటలు—

జ్యోతీన్

లేదు పిన్నీ, నువ్వు వెళ్లడానికి వల్లకాదు.

పిన్ని

సరేనమ్మా, నేను ఆమూలకి వెళ్లి కూర్చుంటాను.

జ్యోతీన్

వద్దు వద్దు. నాదగ్గిర కూర్చో, నాచెయ్యి పట్టుకొని. దేవుడు నన్ను నీ చేతులలోనుంచి తన చేతులులోకి అందుకుంటాడు

డాక్టర్

సరే ఐ  మరి మాటలు మట్టుకు ఆపియ్యాలి.  ఆ ముందు పుచ్చుకొనే వేళ అయింది——

జాతీన్

వేళ అయిందీ! నన్ను మరిపించడానికి  వచ్చారూ మళ్లా! వేళ దాటిపోయింది. వట్టి బూటకపు శాంతి మరి నాకు అవసరం లేదు. తీసేయండి పిన్నీ, అవన్నీతీసేయండి పిన్నీ. నాదిఅయిన దానవు నువ్వుఉన్నావు, నాకు ఏవిధమైన మిథ్యా అక్కరలేదు. రాచెల్లీ, రా హిమీ,నా దగ్గిరికిరా అమ్మా. ఇక్కడ కూర్చో.

డాక్టర్

ఇంత ఉద్రేకం మంచిదికాదు.

జాతీన్




అలాగైతే నన్ను మరి గాభరా చెయ్యకండి.

(డాక్టర్ వెళ.)

డాక్టర్ వెళిపోయినాడా? ఐతే నా పరుపు మీద కూర్చో పిన్నీ, నీ ఒళ్లో తల పెట్టుకొని పడుకుంటాను.

పిన్ని

పడుకో బాబూ, కొంచం నిద్రపో.

జొతీన్

నిద్రపో అనకు పిన్నీ, మేలుకొని చెయ్యవలసినది కొంచం ఉంది— వినబడడంలేదూ? వస్తూఉంది. ఇప్పుడే వస్తుంది—కళ్ళమీద అదిఒక మోస్తరు మేఘం కమ్మేస్తూ ఉంది— సంధ్యాలగ్నం, నా గోధూళి లగ్నం—ఇంటి తలుపు విడుతుంది ఇక. హిమీ, కొంచంసేపు ఆపాట పాడవూ "జీవన్ మరణేర్ సీమానా ఛాడాయె"

(హిమి పాట.)

పిన్ని

బాబూ జొతీన్, ఒక్కమారు కళ్ళువిప్పి చూడు. అదుగో వచ్చింది.

జొతీన్

ఏమిటి? కలా?

పిన్ని

కల కాదు నాయనా, మణి! ఇదుగో మీమామగారు.

జ్యోతీన్

(మణి వేపు చూసి) నువ్వు ఎవరవు?

పిన్ని

వినలేదూ? అది నీ మణి!

జ్యోతీన్

తలుపు పూర్తిగా విడిపోయిందీ—— అంతా?

పిన్ని

అంతా విడిపోయింది.

జ్యోతీన్

పిన్నీ, పాదాలమీద శాలువ తీసేయి, ఆ శాలువ తీసేయి, అశుంటపెట్టేయి——దూరంగా తోసేయి.

పిన్ని

శాలువ కాదమ్మా జ్యోతీన్. మణి నీ పాదాల మీద పడ్డది, తలమీద చెయ్యివేసి ఒక్కమారు ఆశీర్వాదం చెయ్యమ్మా!

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.——1927.